# వదరుబోతు.



To,



1917, 1918 సం॥లలో
అనంతపుర విద్యార్థి సంఘమువారిచే
ప్రకటితమయిన పక్షపత్రికల నుండి.

---

సాధన ప్రకటనాలయము
అనంతపురము.
1932



వెల 0—12—0

# ప్రకాశకుల మనవి.

వదరుఁబోతు వ్యాసములలో లభించినవి మాత్రము ఇప్పుడు ప్రకటించితిమి. సగానకు సగము దుర్లభములై యున్నవి. నశించిన వని యే భయము. ఇప్పుడు దొరకినవిగూడ హిందూపురమందలి శ్రీ॥ పక్కా గురురాయాచార్యుల వారి ఆంధ్రసారస్వతాభిమానపు బలమున బ్రతికినవి. ఎంతో భద్రముగా దాఁచియుంచినవానిని వారు ప్రకటనార్థము ప్రార్థించిన వెంటనే మాకు దయ చేసిరి. వారికి మేము చాల కృతజ్ఞులము. ఇవి గూడ నశించునేమోయని యింతయాత్రముగా ప్రకటించితిమి. తక్కినవి మా భాగ్యముచే ఎవరి వద్దనేని యుండినచో వారు దయయుంచి మాకు తెలియఁబఱచెదరేని ధన్యుల మగుదుము. ముందు ప్రకటింతుము.

ఇందలి వ్యాసములకు పెట్టినపేరులు మొదటి ప్రకటనమందు లేవు. చదువరుల యానుకూల్యమునకై యిప్పుడు ఊహింపఁబడినవి. ప్రతి వ్యాసము తుదను కర్తగుర్తుగా వేసికొన్న యక్షరములు మొదటనుండినవి, యిప్పటి ప్రచురణములో పొరఁబాటున వదలఁబడినవి. సాధ్యమైనంత

వఱకు మొదటి ప్రకటన మందలి క్ర
మే వ్యాసముల చేర్పఱచితిమి. క
తేది, ప్రాంతసంఖ్య లభింపమిచే వద
వది. వానిని, చేవ్రాలు గుర్తులను
ఈక్రిందఁ బొందుపఱచితిమి:—

| ఇప్పటి సంఖ్య. | మొదటిది. | తేది |
|---|---|---|
| ౧ | ? | ? |
| ౨ | ? | ? |
| ౩ | ? | ? |
| ౪ | ౭ | ౧-౧౧-౧౯ |
| ౫ | ౯ | ౧-౧౨- |
| ౬ | ? | ? |
| ౭ | ? | ? |
| ౮ | ? | ? |
| ౯ | ? | ? |
| ౧౦ | ౧౪ | ౧౫-౨- |
| ౧౧ | ? | ? |
| ౧౨ | ౧౬ | ౧౫-౩- |
| ౧౩ | ౧౭-౧౮ | ౧౫-౪ |
| ౧౪ | ౧౯ | |
| ౧౫ | ౨౦ | ౧౫-౫ |

| | | | |
|---|---|---|---|
| ౧౬ | ౨౧ | ౧-౬-౧౮ | డు |
| ౧౭ | ౨౨ | ౧౫-౬-౧౮ | ల |
| ౧౮ | ? | ? | క్ర |
| ౧౯ | ౨౪ | ౧౫-౭-౧౮ | డు |
| ౨౦<br>౨౧ | ఇవి రెండును క్రమముగా ౫-౫-౨, ౨-౩-౨౩ తేదీల | | క |

లో 'పినాకిని' పత్రికలో ప్రకటింప బడినవి.

| | | | |
|---|---|---|---|
| ౨౨ | ? | ౧౯-౧౭ | క్ర |

గ్రంథకర్తల వ్యక్తిని ప్రకటించు నధికారము మేము గైకొనలేదు. ఏ యుద్దేశముతో వ్యాసకర్తలు మొదలు తమ స్వరూపములను మఱుఁగుపఱచిరో యాయుద్దేశము వారికిప్పటికిని మాఱలేదు, గావున నీవిషయమున నిర్బంధము నిరుపయోగమని తలఁచితిమి.

దీనిని ప్రోత్సహించి యాంధ్రులు మా ప్రయత్నమును సఫలము చేయుదురుగాక!

అనంతపురము
1-7-32.

సాధన ముద్రాలయాధికారులు,
ప్రకాశకులు,

# సవరణ.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 6 | లాఁడి | లాం |
| 17 | 14 | కర్వా | కర్యా |
| ,, | 15 | ఏన | యేన |
| 49 | 2 | ణాః | ణాః |
| 60 | 11 | ఢు | ధు |
| ,, | 12 | ఘా | ధా |
| 67 | 10 | ధృ | ధ్రి |
| 71 | 9 | వృంధయం | వృవ్రిజం |
| ,, | 12 | మాట | మాపి |
| ,, | 13 | ఢుష్టు | ద్రిష్టు |
| 121 | 10 | దా్రియ | దా్రియి |
| ,, | 12 | దికా | దిక |
| ,, | 13 | ష్ఠ | ష్ట |

(ఇంకను గొన్ని కలవు. కాని యవి యంత ముఖ్యముగాఁ దోఁపమి వదలఁబడినవి.)

Y. V. N. Acharya

శ్రీ

# ప్రస్తావన.

కడచిన ప్రపంచమహాసంగ్రామము మనుష్యజాతి దృష్టినే క్రొత్తత్రోవకుం ద్రిప్పినదనుట సుప్రసిద్ధవిషయము. నీతి, మతము, ధర్మము, సంఘము మొదలగువాని దృఢమూలములగు కట్టుదిట్టముల నన్నింటిని కదలించి మన మనోవాక్కాయములను దిక్కుదిక్కులకు పరవశముగాం ద్రోసిన పెనుతుపానుగా నాయుద్ధము పరిణమించినది. తీవ్రముగ యోజించు స్వభావముగల యనంతపురపుం దరుణులలోని యొకరిద్దరి హృదయములం దా యుద్ధకాలమునం గలిగిన కదలిక ఫలమే, యీ 'వదరుబోతు'.

ఇవి రచింపంబడి యించుమించుగా పదునైదు వర్షములు గడచినవి. ఈపదునైదు సంవత్సరములలో మన త్రికరణముల నడవడులందుం గలిగిన మార్పు అత్యద్భుతము. స్వాతంత్ర్యాకాంక్ష యిపుడు శాఖోపశాఖలుగా పుంఖానుపుంఖములుగా ప్రాఁకుచున్నది. కాని యప్పటి సన్నివేశములు వేఱు. ఇప్పటి కాయలును పండ్లును అప్పుడు పిందెలుగానో పూవులుగానో యుండి

నవి. తమ యందలి యాజీవశక్తిని బలవంతముగా రవులుకొల్పి బయలుదేర్పఁగల యుత్సాహమును, ఉద్రేకమును గలవా రాకాలమునఁ గొందఱే. ఈవ్యాసకర్తలకు ఆకొందఱిలోఁ జేరుట కధికారము గలదు.

కాని ఉత్సాహోద్రేకము లున్నవారి కందఱికిని ఫలముగాని పనిచేయు త్రోవలుకాని ఒక తీరున నుండవు. భరత ఖండమునకు స్వాతంత్ర్యమును శక్తిని సంపాదించు నాత్రముతో పనిచేసిన దేశవీరులలో కర్మాగారములను స్థాపించినవారు కొందఱు, కారాగారములకు పోయినవారు కొందఱు; అసెంబ్లీలకుఁ బోయినవారు కొందఱు, అండమాను దీవులకుఁ బోయినవారు కొందఱు; అందినను అందకున్నను జుట్టుపట్టుకొని పోరాడఁ బోయినవారు కొందఱు, కాళ్ళుపట్టుకొని విదిలింపులు తన్నులుఁ దిన్నవారు కొందఱు; చంపినవారు కొందఱు, చచ్చినవారు కొందఱు; తామొక్కరు కష్టపడి త్యాగము చూపుటకంటె ప్రజలలో నుద్బోధము గలిగించుట యుత్తమమని తలఁచి మఱికొందఱు ఉపన్యాసముల మూలమున నాపని చేయుదురు. ఇంక కొందఱు—తమ వాక్ఛక్తిమేర నెఱిఁగినవారు—వ్రాఁత మూలమున నా

పనిచేయఁ దొడఁగుదురు. ఈవ్యాసకర్తలట్టివారు.

స్వాతంత్ర్యమనఁగా స్వరాజ్యమని మాత్ర మేకాదు. కేవలము దానికై పోరాడుచు ప్రజల లోని నీతి మత ధర్మాదులయందుఁగల దాస్యము ను దైన్యమును గమనింపక విడిచిన స్వతంత్రవాది ప్రాయశః స్వార్థపరులలో మొదటివాఁడని భావిం చి మనము దూరముగా తొలఁగి పోవలయును. రాజకీయ స్వాతంత్ర్యి మొకకొమ్మలోని పండేకాని పంటయంతయు నదేకాదు. తక్కినవానితోపా ట దియు పండును. దానికై ప్రత్యేకముగాశ్రమించి తక్కినవానిని వదలుట వెఱ్ఱిసేద్యము. కావుననే యీవ్యాసకర్తలు భరతఖండ రాజకీయ స్వాతం త్ర్యమునుగూర్చి యెక్కువ జోక్యము చూపలేదు. వీరు పొమ్మనువారుగారు, పొగఁబెట్టువారు.

ఇట్టి ప్రజోద్బోధ కార్యమునకు ఇంగ్లీషు సారస్వతము నందలి అడిసన్ ద్వార ఆశ్రయించిన పేరులేని యుపన్యాసములను పంచిపెట్టుపద్ధతి చాల అనుకూలముగా ఈ వ్యాసకర్తలకుఁ దోఁచినది. అడిసను ప్రకటించిన 'స్పెక్టేటరు', అతని మిత్రుఁ డగు స్టీలు ప్రచురించిన 'టాట్లరు' వ్యాసములకుఁ గల ప్రసిద్ధియు విలువయు ఆంగ్ల సారస్వతముతో పరిచయముగల వారందఱు నెఱుఁగుదురు.

ఈ 'వదరుఁబోతు' వ్యాసకర్తలకన్న మునుపే—అనఁగా ౧౯౧౩ వ సంవత్సరముననే—ఈ కార్యము చేయుటకు ప్రారంభించినవారు సుగృహీతనామధేయులగు శ్రీపానుగంటి లక్ష్మీనరసింహరాయ కవీశ్వరులు. వారు అడిసన్ దొరయొక్క 'స్పెక్టేటరు' పదమునే 'సాక్షి' గా భాషాంతరీకరించి ఆపేరుతో తమ యమూల్యవ్యాసములను సువర్ణలేఖపత్రికలో తొలుదొల్త ప్రచురింప మొదలిడి కొన్నాళ్ళ కెందులకో నిలిపివేసిరి. తరువాత ౧౯౨౦ యవ సంవత్సరమునుండి పుంఖానుపుంఖములుగా ఆంధ్రపత్రికయందు బయలు వెడలుచుండిన వారి 'సాక్షి' వ్యాసములను చదివి ఆనందింపని యాంధ్రుఁడుండఁడు. కాని యీవ్యాసకర్తలు ఆ మొదటి 'సాక్షి' వ్యాసముల నెఱుఁగరు. వీరేకాదు, ఆంధ్రపత్రికలో వచ్చు వఱకును ఏ కొందఱికో కాని ఆంధ్రదేశమున 'సాక్షి' పేరు తెలిసి యుండలేదని స్పష్టముగాఁ జెప్పవచ్చును. కావున 1917 లో 'వదరుఁబోతు' జననమునకు 'సాక్షి'తో నేసంబంధమును లేదనుట నిక్కము. ఇరువురకును ఒకవిధమైన యుత్సాహోద్రేకములే యుండినను నరసింహారావుగారికి, 'స్పెక్టేటరు' అను అడిసను దొరయుంచిన పేరే తామును తెలుఁగులో తమ వ్యాసముల

కుంచుకోవలెనని తోఁచినది. ప్రకృత వ్యాసకర్తల కంతకంటె స్త్రీలుయొక్క 'టాట్లరు' అను పద మెక్కువ రుచించి వారు దానిని 'వదరుఁబోతు' అని తెలిఁగించుకొనిరి.

కాని నిజముగాఁ బరీక్షించితిమేని 'సాక్షికి' 'వదరుబోతనియు, 'వదరుఁబోతునకు 'సాక్షి'యనియు పేళ్ళుండిన స్వరూపౌచిత్య మెక్కువగా నుండి యుండునేమో యని యొక యూహ తోఁచెడిని. 'వదరుఁబోతు' అనుపదమునందలి నీచార్థమునువదలి 'వాగ్మి'అనునర్థమును మాత్రము గ్రహించితిమేని-అట్లే గ్రహింప వలయును గదా-'సాక్షి' లోనున్నంత మాటల పాటవము, అడ్డు ఆఁకలేని నాగుఁబాముసడక, సందేహములేని సిద్ధాంతములు, గరుసుపాఱని గొంతుకతో రచ్చలోనున్న వారికెల్ల వినవచ్చునట్లుగాచేయు రాద్ధాంతములు,-ఇవి 'వదరుఁబోతు'లోఁ గానరావు. 'సాక్షి' సంఘమందలి ప్రముఖపాత్రమగు జంఘాలశాస్త్రికి నోరు తప్ప మఱియేమైన నవయవము లుండెనాయను సందేహము చదువరులకుఁ గలిగినను అది సహజముగానే తోఁచును. 'వదరుబోతు' మార్గము కొంతవఱకు మృదువైనది. ధ్వని ప్రధానము. ఇరువురును తిట్లలో మేటులైనను, 'సాక్షి' తిట్లలోని

తెగువ 'వదరుఁబోతు' తిట్లకులేమ. 'వదరుబోఁతు' తిట్లలోని తీపు 'సాక్షి' తిట్లకులేదు. ఉదాహరణా ముగా వీరిరువురును చేసిన సారంగధర నాటక విమర్శను చూచినచో నీవిషయము స్పష్టమగును. ఇంతకన్న నెక్కువచర్చకిది చోటుగాదు.

ఇదిగాక ఇంచు మించుగా నీ'వదరుబోఁతు' జన్మించిన కాలమందే గుంటూరునుండి కాఁబోలు నొక్కరు ఇట్లే కొన్ని వ్యాసములు ప్రకటించు చుండిరి. వాని పేరు ప్రకృతము మఱచితిమి. ఎట్లో వారు మకుటముగా నుంచుకొని యుండిన ఈక్రింది పద్య మొకటి జ్ఞప్తిలో నిలిచినది.

"తే. ఉద్ధరించెద దేశమే నొక్కరుఁడనె
నిక్కమియ్యది చేయంగ నేర రొరులు
అనుచు విలియము పిట్టను నతఁడు పలికె;
అట్లెయందఱుఁ దలఁచిన నగును శుభము."

గుంటూరు మిత్రులొక్కరివద్ద నీ వ్యాసపత్ర ములు రెండుండఁగాఁ జూచియుంటిమిగాని యితరు లీప్రాంతములలో నెవరును వాని నిదివఱకు కని యెఱుఁగరు. వినియెఱుఁగరన్నను తప్పులేదు.

ఈవల కీ॥ శే॥ వంగూరు సుబ్బారావుగారు 'వసంతలేఖలు' అను పేర కొన్ని వ్యాసముల నాంధ్ర పత్రికలో ప్రకటించుట సర్వవిదితమే. ఇంకను

గొందఱట్టివేమైన వ్రాసిరేమో మాదృష్టికి రాలేదు.

ఈవ్యాసకర్తలు ఇరువురు; ముగ్గురన్నను తప్పులేదు. వారిపేళ్ళు ప్రచురించుటకు మాకిప్పు డధికారములేదు మొదలువారు ప్రకటించుకో లేదు. కారణము మాకుఁజూడఁగా నిది: అధికార వృద్ధులు, వయోవృద్ధులు, విద్యావృద్ధులుగూడ నాచరించుచుండిన కొన్ని పద్ధతులను ఆచారము లను తప్పులని తోఁచినప్పుడు విమర్శించి ఖండిం చుటకై జనించిన వీవ్యాసములు. ఈవ్యాసకర్తలు అధికార విద్యావయోధనాదులందు సామాన్యులే కాని విశిష్టులు గారు. అట్టివారు ఇతరులను ఖం డింపఁ బూనినప్పుడు వారిపేరు ప్రచురమయ్యెనా వారినామధేయులకన్న నల్పముగాఁదలఁచి తిర స్కరించుజనులే యెక్కువ. తమ్ము ఖండించువార నామధేయులుగా మఱుఁగున నుండిరా వారెవరో సుగృహీత నామధేయులని జనులు భావించి మన్నించుటయు సహజము. కావున సంఘమందలి లోపములను వెలికిఁబెట్టుటయే ప్రధానోద్దేశముగాఁ గల 'వదరుఁబోతు' వ్రాయసగాండ్రకు తమ పేరు మఱుఁగించుకొనుటయే కార్యసాధన మార్గముగా తోఁచియుండును. మఱియు సంఘసేవాకార్యము నకు తోడు స్వసేవయగు నీనామధేయ ప్రకటన

మేలయను నౌదాసీన్యముగూడ రెండవ క
ముగా నుండవచ్చును. ఈవ్యాసకర్తల నె
మిత్రులు కొందఱు వారియందీ స్వార్థరాహి
ఎంత నేఁటికిని కలదనుట యెఱుఁగుదురు.
యుద్దేశముల్లే యుండుటచే ఇప్పుడును వారి
ములు మఱుఁగుననే యుంచఁబడినవి.

ఈ 'వదరుబోతు' జన్మించినది, పనిచే
సన్యసించినదిగూడ అనంతపురమందే. అ
యూరిలో నుండినది ఆచార్యుల గుట్టపు త్రో
పదిప్రక్కలందును పదిమంది చేతులువేసి న
వలసిన ప్రాఁత 'ప్రెస్సు' ఒకటే. అది 'స
విలాస ప్రెస్సు'. అన్ని పనులకు అదే ఆధా
చేతడబ్బు ఎక్కువలేక, అధికారము లేమియ
యున్నవారు ఆకాలములో పక్షమున కొక
క్లిష్టముగా నాలుగైదు ఫుటల వ్యాస
ముద్రింపించు భగీరథప్రయత్నమాపని చేసిన
తప్ప నితరులెఱుఁగలేరు. ఎట్లో కష్టపడి మ
పించి వ్యాసములను కాలణా కొకటిగా
అమ్మి, పోస్టుకర్చులు పెట్టికొని బైటి కెంద
ఉచితముగాపంపి, ఎన్నో ప్రతులు తిరిపెము
సుమారు రెండేండ్లకుమించి దీనినినడిపి
-సుప్రసిద్ధ కారణములచేత-'వదరుబోతు'

మూసికొనెను. మొత్తము ప్రకటించిన వ్యాసములు సుమారు ౫౦.

కాని యిప్పుడు వానినెల్ల నొక సంపుటముగా ప్రకటింపఁ బూనుకొనఁగా దొరకినవి ౨౨ మాత్రమే. కర్తలు స్థలాంతరములకుఁబోయి కార్యాంతరములకుఁజిక్కి పోవుటచేతను, ఒకతూరి వ్రాసి పంచిపెట్టుటచేత తాము తలపెట్టిన పని యైనది గావున నీవ్యాసములను భద్రపఱచియుంచవలసినంత యక్కఱ వారికంతగా లేకపోవుటచేతను నైవ్యాసములలో ననేకములు దుర్లభములైనవి. కాని చదువరులలో హిందూపురము శ్రీ పక్కా గురురాయాచార్యులవంటి యభిమానశాలు లుండబట్టియే ఈ వ్యాసములిన్నియైనను నేఁటికి దొరకినవి. ప్రకాశకులు వారికి కృతజ్ఞులు. తక్కినవి యెంత ప్రయాసపడినను దొరకవయ్యెను. ఎవరి వద్దనైనను ఇప్పుడు లభింపనివ్యాసము లున్నచో దయచేసి యిచ్చినచో ప్రకాశకులు కృతజ్ఞతతో నందుకొని యవకాశము లభించినప్పుడు చేర్చి ప్రకటింతురు.

వ్యాసకర్త లుదాసీనముగా నున్నను, కాలమెంత మాఱినను, ఇంకను ఈవ్యాసములు చేయవలసిన ప్రబోధకార్యమున కవకాశముగలదని తోఁ

చుటచే వీనిని పుస్తకరూపమున ప్రచురింపవలసెను. తక్కినది "భాగ్యాయత్తమతఃపరం నఖలు తద్వాచ్యం" అన్నాడు వేఱొకసందర్భమున కాళిదాసు.

# విషయసూచిక.


| వ్యాసము | | పుట |
|---|---|---|
| ౧ | కృతార్థత | ౧ |
| ౨ | సృష్టికర్తయుద్దేశము | ౭ |
| ౩ | గౌరవపదార్థము | ౧౪ |
| ౪ | తీఱికలేమి | ౨౧ |
| ౫ | విద్య | ౨౬ |
| ౬ | బిరుదయుగము | ౩౨ |
| ౭ | హాస్యకళ | ౩౯ |
| ౮ | అనుకరణ విద్య | ౪౬ |
| ౯ | స్వకీయచరిత్ర | ౫౧ |
| ౧౦ | సుఖస్వరూపము | ౫౮ |
| ౧౧ | సత్యసంధత | ౬౫ |
| ౧౨ | ఆధునికకవిత్వము | ౭౦ |
| ౧౩ | నాటకతత్త్వము | ౭౬ |
| ౧౪ | పెండ్లిపిలుపు | ౮౩ |
| ౧౫ | ఆచార్యునికన్న ననుభవము మేలు | ౮౮ |

| | | |
|---|---|---|
| ౧౬ | స్వాభావికశక్తి | ౯౪ |
| ౧౭ | కురులమొఱ | ౯౯ |
| ౧౮ | ప్రపంచయంత్రము | ౧౦౬ |
| ౧౯ | సదయునికథ | ౧౧౨ |
| ౨౦ | సారస్వత స్వప్నము (1) | ౧౧౯ |
| ౨౧ | ,, (2) | ౧౨౭ |
| ౨౨ | దీపావళి | ౧౩౬ |

వై. వి. నరసింహా శాస్త్రి
బి. ఎ.

# వదరుబోతు.



## కృతార్థత.

౧

సంఘమర్యాదలు, గుణశీలములు, విద్యావృత్తులు మున్నగు వానిలో నాలేఖలకు విషయములు కాఁగల యంశములు పెక్కులుండుటంబట్టి వానిలో నెద్దాని గూర్చి తొలుత వ్రాయవలయునని యాలోచించుచుండగనే వారము దినములు గడచెను. నవనాగరకత (Modern civilisation), గౌరవబిరుదములు (Sounds of Honour), భౌతికసంపత్కౌశలును (Material Prosperity) బలుమాఱు నాస్మృతిపథమునం దగులుచుండెను. కాని, యిప్పటిసంఘములో నగరమర్యాద వానికే యున్నఁగూడ నాకవి రుచించినవికావు. ఏదియుం దోపక యొక సాయంతనమున నగరారామ (Public Park) ప్రాంతమునఁ బచ్చికతిన్నెపై

గూర్చుండి యాలోచించుచుండు నంత, నా ప్రాంగణ
మున నరుగు బాలుఁ డొకఁ డొక గీతము పాడుచు
వింటిని. నా మది కది యొక వింత వికాసము
గూర్చెను. ఆగీత మిది:—

గీ॥ చెట్టునకు మొగ్గ దొడిగెడి చేష్ట గలదు,
కోరకమునకు వికసించు గుణము గలదు,
విరికి వలపులు వెదజల్లు విద్య గలదు,
వలపునకు గుబులొల్కును వలవాటు గలదు,
ఇంత సౌభాగ్య మంతయు నెందు కొఱకు?

నిజము! ఇంత సౌభాగ్యమంతయు నెందు కొఱకు? కొంత తడవునకు నా యోజనాధోరణి మానవజన్మము వంకఁ దిరిగి యెప్పటి కీజన్మమునకుఁ గృతార్థత యనుకొంటిని. చింతించుకొలఁది నొకటిపై నొకటి యాలోచనాతరంగము లున ఖుంచి నా భావమును క్షణ మొక వైపునకుఁ ద్రిప్పుచు నెంతో తొందర సేయుచు వచ్చెనుగాని, "ఇదమిత్థ"మని నిర్ధరించుకొనలేక పోతిని.

అర్థమెఱింగియో, ఎఱుగకయో—ముప్పు వంతు లిదియే వాస్తవము పలువురు మోక్ష ప్రాప్తిచే మానవజన్మమునకు సాఫల్యమబ్బు ననెదురు. కాని యామాట శాస్త్రార్థమే! కాన నే వదలితిని.

ఇఁక ననుభవమున నీవిషయమై జనుల యభిప్రాయము పలుతెఱఁగులుగ నున్నది. వారి వారి యభిరుచికిని, సాంగత్యమునకును, అభ్యాసమునకును, వివేకమునకును దగినట్లు వారు నిర్ధరించుకొందురు. ధనమే ప్రపంచమున కాధారభూతమని నమ్మి, కుడువక, కట్టక, ప్రాణము పోయినను సరే పణముపంచి ముడి విప్పరాదని లక్ష్మీదేవి నూపిరి పోకుండఁ బాతిపెట్టుచుఁ గొల్లలుగ నార్జించి లోభి "ధనోఽస్మి" యనుకొనును. పనిపాటలు లేక వివిక్తస్థలమునఁ గూర్చుండి, ఏ యూహలుచెప్పనైననో, ఏ గురువిలచిపోదను గూర్చియో, పోలు పొందు లేని యుత్ప్రేక్షోపమానములతో, పద్యము లల్లుచుఁ గవులు నిర్భరానందమనుభవింతురు. సృష్టికర్త స్త్రీలింగము ప్రసాదించియున్నను "కళత్ర"మునకు నపుంసకలింగమును దయింత నారోపించి లేని తంటాలు పడుచు నెన్నెమ్ముల్లల కంటిబులాగు శాస్త్రము గంతపాఠము చేసి వైయాకరణులానందింతురు. పెరటవాకిటఁ బడుగు విలుసొచ్చి యిల్లాలి యోగక్షేమములరయుచున్నఁ గూడఁ దెలియనేరక వసారాలోఁ బటవాపైనఁ గూర్చుండి గుణోతము వేయుచు నాకసమునఁ జంద్రుఁడు పిశాచిక వలెకేగు కాలము తెలి

గూర్చుండి యాలోచించుచుండు నంత, నాప్రాంత
మున నరుగు బాలుఁడొకఁడొకగీతము పాడుట
వింటిని. నామది కది యొక వింత వికాసముఁ
గూర్చెను. ఆగీత మిది:—

గీ॥ 'చెట్టునకు మొగ్గతొడిగెడి చేష్ట గలదు,
క్రొరకమునకు వికసించు గుణము గలదు,
విరికి వలపులు వెదజల్లు విద్య గలదు,
వలపునకు గుబులొల్కును నలవాటు గలదు,
ఇంత సౌభాగ్య మంతయు నెందు కొఱకు?

నిజము! ఇంత సౌభాగ్యమంతయు నెందు
కొఱకు? కొంత తడవునకు నా యోజనాధోరణి
మానవజన్మము వంకఁ దిరిగి యెప్పటి కీజన్మము-
నకుఁ గృతార్థత యనుకొంటిని. చింతించుకొలఁది
నొకటిపై నొకటి యాలోచనాతరంగము లుద
యించి నా భావమును క్షణ మొక వైపునకుఁ
ద్రిప్పుచు నెంతో తొందరసేయుచు వచ్చెనుగాని,
"ఇదమిత్థ"మని నిర్ధరించుకొనలేక పోతిని.

అర్థమెఱింగియో, ఎఱుగకయో—ముప్పది
వంతు లిదియే వాస్తవము పలువురు మోక్ష
ప్రాప్తిచే మానవజన్మమునకు సాఫల్యమబ్బు నం-
దురు. కాని యామాట శాస్త్రార్థమే! కాన నది
వదలితిని.

ఇఁక ననుభవమున నీవిషయమై జనుల యభిప్రాయము పలుతెఱఁగులుగ నున్నది. వారి వారి యభిరుచికిని, సాంగత్యమునకును, అభ్యాసమునకును, వివేకమునకును దగినట్లు వారు నిర్ధరించుకొందురు. ధనమే ప్రపంచమున కాధారభూతమని నమ్మి, కుడువక, కట్టక, ప్రాణము పోయినను సరే పణపుసంచి ముడివిప్పరాదని లక్ష్మీదేవి నూపిరి యాడకుండఁ జాతిపెట్టుచుఁ గొల్లలుగ నార్జించి లోభి "ధన్యోఽస్మి" యనుకొనును. పనిపాటలు లేక వివిక్తస్థలమునఁ గూర్చుండి, ఏ యూరుబిచ్చుకయైననో, ఏ గురువిందపొదను గూర్చియో, పోలు పొందు లేని యుత్ప్రేక్షోపమానములతో, బద్యము లల్లుచుఁ గవులు నిర్భరానందమనుభవింతురు. సృష్టికర్త స్త్రీలింగము ప్రసాదించియున్నను "కళత్ర"మునకు నపుంసక లింగమును దగుంత నారోపించి లేని తంటాలు పడుచు నెన్నెమ్ముల కంబులాగు శాస్త్రము గంఠపాఠము చేసి నైయాయికులు లానందింతురు. పెరటివాకిటఁ బడుగు చిలుపొచ్చి యిల్లాలి యోగక్షేమము లరయుచున్నఁ గూడఁ దెలియనేరక వసారాలోఁ జరివాపపైఁ గూర్చుండి గణితము వేయుచు నాకసమునఁ జంద్రుఁడు పిశాఖ నెడకేగు కాలము తెలి

నంతేఁ దమ శాస్త్రమునఁ గాకున్న బ్రపంచమే యుండదని జ్యోతిష్కులు పొంగుదురు. మోయ లేని బరువుమోసిగాని, ఇనుపసంకెలలఁ ద్రెంచిగాని చూపఱచే పెబా సనిపించుకొన్నంత సృష్టికర్త యుద్దేశము నెఱవేఱెనని "కలికాలభీములు" కొం-డరు సంతసింతురు. స్వభావసిద్ధమగు పుంభావ మునకు లేని పోని స్త్రీత్వమును బలాత్కారముగ నారోపించుకొని 'చిత్రాంగి'గనో, 'తార'గనో రంగస్థలమున నటింపఁగోరి, యొంటిగ నద్దము ముందు నిలిచి యక్కఱమాలిన నవ్వును, అనవసర మగు శోకమును సక్రమముగ నభ్యసించుచు, దమ వికారచేష్టలకుఁ దామే యానందించుకొను బృహ న్నలలు కూడఁ గలరు. సర్వస్వమును బచ్చింటఁ గుదువ యుంచి బాలామణికో మోహనాంగికో చరణదాసులై, సమయమెఱిఁగి మునుముందుగ నానతిపొంది యామెటారి తాంబూల రక్తాధరమును ముద్దుగొని యందలి యమృత ధారల—అబ్బ!—చేరలబంటి జుఱ్ఱుచు "బ్రహ్మానందాధిరాజ్యపదవి" లోనున్న తరుణమూర్ఖుల జీవితమునకుఁ గృతార్థత వేఱుగ నడుగనేల?

"మదకలమదిరాక్షీ నీవిమోక్షోహి మోక్షః"

అనుసూత్రము వీరికయ్యే వ్రాయఁబడుట!

ఇఁక సురాదేవీ వరప్రసాదమువనో, గానామృత రసాస్వాదమహిమ వలననో, చొక్కి యిహపరము లెఱుఁగక వికారచేష్టలఁ జేయుచు నద్వైతసుఖ మనుభవించు చరితార్థ జన్ములగువారి యానంద పరిమితి వర్ణింపఁ దరముగాదు.

ఇట్టి కృతార్థజీవితులలో నింకొక తెగవారిని మాత్రము స్మరింపకుండఁ జాలను. "దేహ మశాశ్వతము ప్రాణము బుద్బుద ప్రాయము. బ్రతికిన నాఁడే బాగుగ తిందము గాక!" అనుట వీరి మూలమంత్రము. ఈమహనీయులకు

**"దినముల లోపల నుత్తమ దినమే తద్దినము."**

నాకుఁజూడ వీరి పద్ధతి యొకవిధముగ మెఱుఁగే! శాస్త్రములలో నెల్ల ముఖ్యమైనది—దేహ మశాశ్వతమని—వీరు మాత్రమెఱుఁగుదురు గాన.

ఈ యాలోచనల సారాంశము ప్రపంచమునఁ బ్రతిమానవునకునుఁ గృతార్థత వేఱనుట! కాని తుదకీ ఫలితార్థమును విశ్వసింపనైతిని. సర్వసముఁడగు సృష్టికర్త కిట్టి పిచ్చియుద్దేశ ముండదనుట స్పష్టముగఁ దోచెను. అప్పటికిఁ జాలఁ జీఁకటి పడియుండుటచే నాయోజనలఁ జాలించి యెవరినైన మహనీయుల నడిగి యీప్రశ్నమున కుత్తరము వడయ వచ్చునను కొని యిలుసేరితిని.

తరువాత ననేకులఁ బ్రశ్నించి కొన్ని యుత్తరములఁ గొంటిని. ఫలము తృప్తికరము గాదు.

నిన్నరాత్రి బజారున హరికథాకాలక్షేపమని విని యట కరిగి దూరమున గుంపునఁ గూర్చుంటిని. నాఁటికథ "గరుడగర్వభంగము". తన్నవమానింప నెంచిన నారదుని మోసపుమాటల నమ్మి యమాయకురాలగు సత్యభామ, వనవాసమున నున్న సీతాదేవివలె వేషము ధరింపఁగోరి మొగమునిండ మసిబొట్లు పెట్టుకొని కుంటినడకలతో, శ్రీరామాకృతితో నున్న కృష్ణుని కడ కరుదెంచుచుండెనని కథకుఁ డభినయ పూర్వకముగఁ నుపన్యసించుచుండెను. క్రిక్కిరిసియున్న జనులందరు కడుపు లుబ్బ నవ్వుచు సత్య నవమానించుచుండిరి. కథకుని చేరువనున్న పండితులు తలలూచుచుండిరి. వాస్తవముగ నింతటి యవమానమే గల్గియున్నచో సాత్రాజితియంతటి మానవతి యూపిరితో నుండియుండ దనుకొంటిని.

అంతలో నాయున్న చేరువ నొక చిన్న కలకలము గలిగెను. ఏవఁడో యనాథ బాలుఁ డొకఁడు రెండు దినములుగఁ దన కాహారములేదని దీనముగ నచటి వారి నన్నము యాచించుచుండె. ముఖవైఖరిజూడ వానికథ నిజముగఁ దోచినది.

అచటి వారు వానిని 'దొంగ' యనియు, కథ కష్టము వచ్చెననియుఁ జీవాట్లు పెట్టుచు నవలఁ ద్రోయసాగిరి. వానిగతి పాప మనిపించుచుండెను. అంతలో నచటి ముసలియవ్వ యొకర్తు లేచి వారిని వారించి "నాయనా! అన్నము పెట్టెదర"మ్మని యాబాలునిఁ దోడ్కొని పోవసాగెను. కథను వదలి పోవుచున్న దేయని నే నాశ్చర్యపడి "అవ్వా హరికథవలదా?" యంటిని. ఆమె నవ్వి యిట్లనుచు వెడలి పోయెను.

"జపతపంబుల కన్న, చదువు సాముల కన్న,
నుపకారమే మిన్న, యో కూనలమ్మ"!

---

## ప్రత్యేక ఉద్దేశము

నిద్రించునపుడు తప్ప మనుష్యుఁడెల్ల వేళల యందు నేదేనొక విషయమునుగూర్చి యోచించు చుండును. అతనిభావనా సముద్రమునఁ బ్రతి క్షణమును వేరువేరు యోచనాతరంగము లుప్పతిల్లి యాయు త్తరక్షణముననే యణఁగిపోయి క్రొత్త వానికిఁ జోటిచ్చును. ఎట్టి భావములఁ బోజని

య్యేక మనస్సును బరిశాంతముగా నుంచుకొనుట యోగాభ్యాసపరులగు మహాత్ములకేగాని కేవల మానవునకు సాధ్యముగాదు.

విశ్రాంతి వేళల వాహ్యాళి వెడలునపుడు నాబుద్ధి యోచనా లహరిలోఁడి మునిగి తేలు చుండునుగాని, యగాధ జలములోఁ బ్రమాద మునఁ బడి కాలుసేతు లిట్టట్లుగదల్చి యాప్రశాంత సలిలముల సంక్షోభింపఁజేయుటచే నీతరానివాఁ డొట్లు దరిఁజేరలేఁడో యట్లే నాబుద్ధియు దరిగాం-చుటలేదు. మానవుఁడాచరింపవలసిన ధర్మంబులఁ గూర్చియు మనుష్యజన్మ సార్థకతఁ గుఱించియు చింతించుచుండుట నాకెక్కువ యలవాటు. ఏదే నొకకారణమునఁ దనపల్లియవీడి చేరువనున్న ప-ట్టణమునకుఁబోయి, యందుఁ దటాలునఁ దన ప్రక్కఁ బాఱిపోయిన మోటారుబండినిజూచి దాని చలనమునకుఁ గారణమరయఁ బ్రయత్నించిన మూఢుఁడగు పల్లెటూరివాని యోజన యెంతవఱకుఁ గృతార్థతఁ జెందునో మనుష్యధర్మంబునుగూర్చి చేయు నాతలపోతలుగూడ నంతవఱకే ఫలించినవి. ఐనను నావిచ్ఛిన్నూహాలను నేను మానుచుండుట లేదు.

ఒకే నాయంతనమున నిట్లాలోచించుచుంటిని.

లోకములో నెన్నియో వేల మతములున్నవి. ఒక్కొక్క మతము వారలొక్కొక్క దేవుని నమ్ము చున్నారు. అందఱును వారి వారి యూహల కందినట్లు స్వర్గ నరకములఁ గల్పించుకొని మనుష్యుఁడు దాను జేసిన పుణ్యపాపములఁ బట్టి స్వర్గమునకో నరకమునకో పోవునని గట్టిగా నమ్ము చున్నారు. ప్రతివాఁడును దనమతమే యుత్కృష్టమైనదనియు నితరదేవతలఁ గొల్చువారు పుణ్య-ములంబడయఁజాలరనియు వాదించుచున్నారు. ఈ వాదము లెన్నియో వేల యేండ్లనుండియు జఱుగుచున్నవి; యింక ముందెన్ని వేలయేండ్లకును నిలిచి పోవునవి గావు. ఇది తెలిసి యుండియు నీతత్త్వముఁ గూర్చి, శాస్త్రజ్ఞులును, తార్కికులును, కవులును, విద్యావంతులును దమ జీవిత కాలమంతయు విచారించుట వృథా కాలహరణము సేయుట గాదా? ఎందులకిన్ని శాస్త్రములు భూమినవతరించుట? ఇందఱు మతాచార్యులు, ఇన్ని దేవాలయములును వట్టి యాడంబరములేనా?

కాని యొకవేళ లోకములోని జనులందఱును సమ్మతించి యొక మతమునే, యొక దేవతనే శ్రేష్ఠముగా నొప్పుకొందురుపో, దానివలన మనుష్యునికిఁ గలుగు లాభమేమి? అప్పుడు మాత్రము జనులంద

ఱును సత్యవంతులును ధర్మపరులు నగుదురా? అప్పుడు మోక్షమార్గము సుకరమగునా? లేనిచో నిట్టి నిరర్థక ప్రయాసను మానవుఁ డెందుకొఱకు పడుచున్నాఁడు? ఫలమున్నను లేకున్నను మనము శ్రమఁబడి యీతత్త్వము దెలిసికొనుట యవసరమా? తెలిసి కొననిదే మనజీవయాత్రఁ గడపుట దుష్కరమా? మనమిట్టి యోజనలఁజేసి వాస్తవ స్థితి నెఱుఁగ వలయునని సృష్టికర్త యుద్దేశమై యుండునా?

ఇఁక మతములన్నియు నేదేనొక విధమున దేవుని బ్రార్థింపవలయు, నాతనియెడ భక్తిఁగలిగి యుండవలయుననిగదా చెప్పుచున్నవి. మన మెల్లప్పుడు నాతనియెడఁగృతజ్ఞతఁ గలిగి సదా యాతని బ్రార్థనఁజేయవలయునని యాతనియభీష్టమా? అయినచో నాతనికిఁ గలుగులాభమేమి? బ్రహ్మాండమునెల్ల సృజించిన యాతనికి మన మే యుపకారము సేయఁగలుగుదుము? ఓ దేవుఁడా! నీవు దయామయుఁడవు. ప్రేమస్వరూపుఁడవు. నే ననుభవించున వెల్లయు నీవొసంగినవియ. నేనెల్లప్పుడును నీయందుఁ గృతజ్ఞుఁడనై యుండెదను. అని ప్రతిదినము నతనిగుఱించి స్తోత్రము సేయుట వల్ల నాతనికిఁ గలుగు మోక్షమేమి?

ఓ యీశ్వరుఁడా మాకదియు నిదియు నొసఁగి మాకోర్కెల సమకూర్పుమని గూడ కొం-దఱు ప్రార్థనములఁ జేయుచున్నారు. మన కేది శ్రేయస్కరమో యేది కాదో, యెఱిఁగి యుండిన గిదా మనమాతనిని 'ఫలాని' దిమ్మని కోరఁ గలము. ఈశ్వరుఁడు సర్వజ్ఞుఁడే! అతనికి మన లోపములు దెలియవా? మన కావశ్యకము లగు నవి యాతఁడే యొసఁగ లేఁడా? ఇట్టి పిల్లి మ్రొక్కులు మ్రొక్కినవారియందు మాత్ర మతఁ డనుగ్రహించి తక్కినవారియెడ నిరాదరము గలిగియుండునా? దైవప్రార్థనము భక్తితోఁ జేయువారు చేయనివారి కంటె నేవిధమున నిహమున నెక్కువ యభివృద్ధిఁ జెందుచున్నారు. అట్లేని తిర్యగ్జంతువులు భగవత్ సృష్టిలోనివి దైవప్రార్థన సేయుచున్నవా? వానికిఁ గూడ నొక మతమును స్వర్గనరకముల జ్ఞానమును గలదా? భగవంతుఁడు వాని సౌఖ్యమునకుఁ గావ-లసిన దొసంగుట లేదా? పక్షులకుఁ దమ కులాయ ములఁ గట్టుకొను నేర్పును, చిన్న సింహమునకుఁ బెద్ద మేకఁగు సంహరింపఁగలశక్తియు, పొట్టేళ్ళకుఁ జలి దగులకుండునట్లు వెచ్చనియున్నియు, నిట్టి యదియనసేల వాని సౌఖ్యమున కేమి గావలయునో యదియంతయు నాతఁడిచ్చుటలేదా? వానికంటె

మనుష్యుఁడేమి యెక్కుడు సౌఖ్యమనుభవించు చున్నాఁడు?

వానివలెనే మనము సృష్టిలోని జంతువులము. మనము జీవించియుండుట భగవదుద్దేశము గనుక జీవించుచున్నాము. అతని యాజ్ఞయైనపుడు ప్రపంచమును విడచుచున్నాము. ఈ మధ్యన మనచేతలచేఁ గలిగించుకొన్న కష్టములనో, సుఖములనో, యనుభవించుచున్నాము. ఈ చేతఁజేసిన దాచేత ననుభవింప వలయునని గదా పెద్దలు సెప్పెదురు.

'అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మశుభాశుభం'

కాని యీమతములు ధర్మాధర్మములు, వర్ణాశ్రమములు, కట్టుబొట్లు, వీనియాడంబరమేమి? జీవితానంతరమున మాత్రము మననెత్తిన శిఖరమెత్తుటకా యివి? మానవుని జీవితకాలమున సుఖమాపాదించుటకుఁ గానిచోఁ తర్వాత నివియేల? ఈమేఁడంతయు నుపవాసమున మలమల మాడి వచ్చు సంవత్సరము నిరంతరము పండుగుల ననుభవించుట కెట్టమూర్ఖుఁ డిచ్చగించును? కావున వీని నిర్మించిన మహనీయుల యభిప్రాయమేమైయుండును? సంఘమును బాగుపఱచుటకా? లేక ముక్తినొసఁగుటకా? వారు స్వర్గసంపాదన-

ములని జెప్పు ధర్మశాస్త్రములన్నియును సంఘ-
మునకు మేలుగలిగించు నుద్దేశము గలవికావా?

సంఘమునకుఁ జెఱుపుఁగలిగించు కార్యము
లనేగదా వారు నరకహేతువులగు పాపకార్యము
లనుట. మనకుఁ జేతనైనంత మట్టున కితరులకు
మేలుచేయుచు, సంఘమున కేవిధమగు కీడుఁగలి-
గింపక నలుగురిలో సజ్జనుఁడనిపించుకొన్నచో శ్రుతి
స్మృతుల యుద్దేశము నెఱవేరును గదా? అట్లా-
యినచో దేవుఁడుండనిండు, లేకుండనిండు. శంకర
మతమైనఁ గానిండు, చార్వాకమన్న ననిండు.
స్వర్గములుండనిండు; లేక వలసఁబోనిండు; వాని
గూర్చి వృథా కాలక్షేపము లెందుకు? ఈ మన
యుద్దేశము నెఱవేరినచో యిహసౌఖ్య మేమో
తప్పక కలుగును. పరమున్నచో నిస్సంశయముగా
నందును సౌఖ్యమే చేకూరును. లేకున్న నక్కఱ
యేలేదు. వృథా కష్టమేల?

ఇట్లని నామెదకు నాస్తికత్వ మంటఁగట్ట
రాదు. స్వర్గసుఖమన్న నాకుమాత్రము నోరూరక
పోవునా? ఆలోక మేదిశలోనున్నదో నేనిదివర
కెఱుఁగనైతిని గాని లేనిచో నీవేళకు నలకూబ—
రునితో ద్వంద్వయుద్ధము నారంభించియే యుందు
నేమో? పోనిండు; తెలియని మతములకై యద్ధ-

ముకాని గ్రంథములఁజదివి రానిపోని స్వర్గసుఖ-మున కఱ్ఱులు సాచుటకన్న మనయింట మన యూర, మన దేశమున, మన సంఘమున, మన జీవితముల నుపయుక్తములుగఁ జేయుట మిగుల ముఖ్యమని నాయాశయము.

చదువులందులేదు శాస్త్రమందునులేదు,
లేదు వాదద్వైత భేదములను
ఒయటనున్నముక్తి బాటించలేరయా
విశ్వదాభిరామ వినరవేమ?

---

## గౌరవపదార్థము

## 3

మునుపటి కాలమునకును మన కాలము నకునఁగల భేదమును విమర్శించు నొక యర్థ శాస్త్రవేత్త "మునుపటికన్న నిపు డన్నిపదార్థము లకును వెలలు చాల హెచ్చిన"వనియె. నిజమే కాని నాకుందోచినంతలో నీసూత్రమున కొక యపవాద మున్నయది. ఎంతటి సుభిక్ష సంవ-త్సరము లందైనను, ఏ సామ్రాజ్యకాలమం దైనను మునుపటి దినములలో "గౌరవ"మున కింత వెల

తగ్గియుండదు. రామరాజ్యము నాఁడును ధర్మరాజు పరిపాలనమందునుగూడ నీపదార్థమింత యగ్గువ యయినదికాదు. అంత దనుకయేల? ప్రకృతపు ప్రపంచ సంగ్రామము కారణముగ బజరున అన్నింటికిని వెల లసాధారణముగ హెచ్చుచున్నఁగూడ "గౌరవ"ము మాత్రము నానాఁటికి చవుకగఁ బరిణమించు చున్నయది.

ఇంతమాత్రమొక వింతకాదు. ఉపయోగించువారి సంఖ్య యధికమగు కొలఁదిని పదార్థ సంచయపువెల హెచ్చుట మన కనుభవగోచరము. గౌరవపు విషయమున నీవిధి వర్తింపదు. పూర్వకాలమున గౌరవము నపేక్షించువారు చాల తక్కువ. ఎవఁడో నూఁటనొక్కఁడు మాత్రము దాని నభిలషించుచుండెను. ఇపుడన్ననో, ఆబాల గోపాలముగ నందరును గౌరవమునకై యఱ్ఱులు సాచుచున్నారు. కాని గిరాకి హెచ్చినను వెల హెచ్చలేదను టొకవింతయే!

తొల్లింటివారు పరులు తమ్ము గౌరవించినను లేకున్నను తమ తమ ధర్మముల నిర్వర్తించి తృప్తిఁజెందుచుండిరి. నిష్ఠాగరిష్ఠులని పదుగురిలో ఖ్యాతిఁగాంచ నెంచి సంధ్యావందనాదిక మాచరించుచుండలేదు. భక్తితోఁ బలువురు సమర్పించు

నానావిధ ఫలాదుల మఱుఁగున యథేష్టముగ భుజింపఁగోరి కపటయోగమును సలుపుచుండలేదు. దేశోద్ధారకుఁడను కీర్తి గడింపఁ బనిఁ బూనిఁ యుపన్యాసము లిచ్చుచుండలేదు. వారి పద్ధతి వేఱు. ధన్వంతరి వైనను దనమందు లమూల్యములని, అసాధారణములని, సిద్ధక్రియలని, పత్రికలలోఁ బ్రచురించినట్లు కానము. వశిష్ఠాది మహామునులు శిష్యకోటితో ననుసరింపఁ బడుచుండిరిగాని "పర-మహంసపరివ్రాజకాచార్య, ప్రతివాది భయంకర" ప్రముఖ బిరుదములతో వారు తమ్ము బొగడుచుండగాఁ దృప్తితో నాలకించుచుండినట్లు వినము. పరోపకారార్థమై తమ దేహమునేని యాసింపని శిబిచక్రవర్తియు జీమూతవాహనుఁడును దమ స్వార్థత్యాగమును మునుముందుగఁ జాటించిన వారు కారు. మహాకవు లనేకులు నూర్లకొలఁదిగ సద్గ్రంథములు రచించిరికాని "గ్రంథమాలల" స్థాపించినవారులేరు. "జగద్ధితంబుగ" సుప్రసిద్ధమగు భాగవత పురాణమును రచించిన బమ్మెర పోతన "హాలికుఁడు"గ కాలము గడపెఁగాని "భాగవతగ్రంథకర్త"యని తాటికాయ లంతేసి ప్రకటనాక్షరములఁ దనయింటి వాకిటిపైఁ జెక్కించి యుండఁడు. విలువిద్యలో నర్జునుని సయితము

వెఱఁగు పడజేసిన యేకలవ్యుఁడు తనయడవులలోఁ దాను తిరుగుచుండెఁగాని యూరూరు దిరిగి తన శక్తిని జనులకు వెల్లడించుచు "నభినవద్రోణాచార్యుఁ"డని పొగడొంద యత్నించిన వాఁడు కాఁడు.

ఇఁక నేఁటి పత్రికలలోఁ జూడుఁడు; యోగులకును, దేశోద్ధారకులకును, వైద్యులకును, దాతలకును, కవులకును, గ్రంథములకును మితియే కానరాదు. వారి వర్ణన అపారములు. నేను ముందు నేను ముందని గౌరవమునకై ప్రతిమనుజుఁడును ప్రయత్నించు చుండుట యీకాలపు లక్షణము.

ఘటం భింద్యాత్ పటం ఛింద్యాత్
కుర్యాద్వా గార్దభస్వనం।
ఏన కేనా ప్యుపాయేన
ప్రసిద్ధః పురుషో భవేత్ ॥

ఇది నేఁటి ధర్మము.

కాని మరియొక విశేషము గలదు. ఇప్పుడు లభించినంత సులభముగఁ బూర్వకాలమున గౌరవము లభించునదికాదు. ఇపుడు కందముల్వ్రాసిన వారెల్లఁగవులే! మందునూరిన వారెల్ల వైద్యులే! గడ్డము పెంచినంత మహర్షిగానచ్చును. ఉపన్యాసవేదిక నెక్కినంత నాయకపదవి నధిష్ఠింపవచ్చును.

కాని పూర్వకాలమున నిట్లుకాదు. రాజర్షి సత్తముఁడై యపరచతుర్ముఖుఁ డనందగిన మహాతపోనిధి విశ్వామిత్రుఁడు బ్రహ్మర్షిత్వము వడయుటకై యెంతకాల మెన్నిపడరాబాట్లు పడియెనో మనము విననిదికాదు. రాక్షసరాజుచే నపహరింపఁ బడుచున్న లోకమాత సీతకై తనప్రాణములఁ గోలుపోయిన జటాయువును నిర్దేశించి స్మరణచిహ్నము నొకదానినైన నెవ్వఁడును నెలకొల్పలేదు. భగీరథుఁడు గంగను దెచ్చినచోట ప్రశంసా సూచకముగ నొక్క శాసనాక్షర మైనఁ గలదా? తన కహితమైనఁ గానిమ్మని సహజ కవచ కుండలముల నడిగినంత దానమిచ్చిన యా వదాన్య శిరోరత్నమగు కర్ణునికి కడకొక "రాయ బహదూర్" నిచ్చిన పుణ్యాత్ములనైనఁ జూపుఁడు. కాళిదాసునివంటి మహాకవికే రాజసభలో ప్రవేశము చాలకాలమునకుఁగాని కల్గినది కాదఁట.

ఇందలి తారతమ్యమిది. తొల్లి గౌరవము నాశించువా రెంత యుదారులుగ నుండిరో, గౌరవించువారుఁగూడ నంత లోభులుగనుండిరి. ఇప్పుడీ భేదము తారుమారైనది. గౌరవమునకై లోభపడువారు హెచ్చినకొలఁది గౌరవము నిచ్చువారు ప్రబలిరి. అడుగకమున్న, ప్రయత్నింపకమున్న,

యోగ్యతఁ జూపకమున్న, తమంత నితరులకు గౌరవమును గొల్లలుగ దానముసేయు మహోదాత్తు లిప్పుడు గలరు. ఈదానమునఁ దమగౌరవమునకు హాని వాటిల్లునదిగూడ వీరు సరకుచేయని యుదారులు. మునుపటివలె గాక యిప్పుడు బజారున "గౌరవము" వెలకుఁగూడ లభించును. ధనవంతు లెల్లరును స్వేచ్ఛగఁ దానిఁగొని యనుభవింతురు. ఇంతియకాదు. దాతల నాశ్రయింపఁ జాలని వారును, పణమిచ్చి కొన శక్తిలేనివారును గూడ దీసి నార్జించుట కుపాయము లేకపోలేదు. నలుగురు పోవుత్రోవను బోక నూతనమార్గ మొకటి దీని యందరుగుచు నదియే సత్పథమని యుచ్చైస్స్వరమునఁ జాటుచుం బోవుచున్నచోఁ జాలును. ఆమార్గమున రాసులుగ నుండు గౌరవమును జేతనయినంతపట్టి మూటగట్టుకొని యరుగవచ్చును.

కాని యొకటి మాత్రము చింతాకరము. నేఁటి "బాలసరస్వతి"ని రేపు ప్రశంసించు వారరుదు. నిన్నఁటి "రాయబహదూరు"ను నేఁడు తలంచువారు లేరు. మొన్నటి గ్రంథమును, కవిని, ఎల్లుండి స్మరించువా రుండరు. కాని "ఆంధ్రకవితా పితామహ" బిరుదముచే నల్లసాని పెద్దనార్యుఁ డెన్నియేండ్లకయిన గుర్తింపఁబడఁడా?

శిబి కర్ణ జీమూతవాహనుల పవిత్రనామాక్షరము లెన్ని యుగములకైన మాయునా? ముద్రా యంత్రములు పనిబూనిన తరువాతనే వాల్మీకి రామాయణమును రచించెనా? యోగ్యత ననుసరించి గౌరవము తనంత రావలయుఁగాని, కొలఁదికి మీఱి యపేక్షించి నంత రాదనుట ధ్రువము.

Fair Nymph, *if fame or honour were to be attained with ease*
Then would I come and rest with thee and leave such toils as these.

—DANIEL.

---

## తీఱికలేమి

౪

గతరాత్రి సాంఘికవిషయము నొకదానిం గూర్చి వితర్కించుకొనుచుఁ బెద్దయుంబ్రొద్దు నిద్ర మేల్కొనియుండిన కతంబున నేఁటి యుదయమున నాకొక్కింత జబ్బు చేసినది. ఇంచుక 'కాఫీ' సహాయము సేవింతమని "యానందభవన"మునకేగి యొకచోఁ గూర్చుండి 'కాఫీ' నార్చుకొనుచుఁ జుట్టునుం జూచితిని. కొందఱు త్రాగుచుండిరి;

కొంద ఱుపహారములఁ దినుచుండిరి; కొందఱు పోలుపొందులేని విషయములఁ జర్చించు చుండిరి; మఱికొందఱు యువకు లూరక నిలుచుండిచుట్ట ఁద్రాగి గుప్పు గుప్పున పొగ వెడలవిడుచుచు నాకసమున నది నెందు పరిణామములను శ్రద్ధతోఁ దిలకించుచుండిరి; ఒక రిద్దఱుపహారముల నారంగించువారివంక సాసూయముగఁ జూచుచుండిరి.

ఆయువకులలో నొకఁడు 'వదరుఁబోతు' పత్రిక నొక్కటిని జుట్టఁజుట్టి డాకేలఁబట్టియుంటఁ జూచి, నాగరకతరుణులుగూడ నాపత్రికల మన్నించుచున్నారని యానందించితిని. అది యెన్నియవలేఖమో, తద్విషయములపై నతని యాశయమేమో కనుఁగొనన నెంచి యతనిఁ బ్రశ్నింపగా నతఁడు తన కది చదువఁ బ్రొద్దులేదనియు, వలదన్న గౌరవహాని యని తానది పుచ్చుకొనవలసి వచ్చెననియుఁ జెప్పి నాసంశయముఁ దీర్చెను. అకటా! ప్రొద్దులేదఁట! ఒక్క "ఈజిప్టు" చుట్ట నెవఁడైన దానము చేసియుండినచో నానిరంతరోద్యోగి యందే నిలువంబడి యింకొక గడియవఱకుఁ గాలు గదల్చియుండఁడు గదా? నా యానందమున కంతరాయ మొదవ నిప్పుఁడైన మన నాగరకతరుణుల 'ప్రొద్దులేమి' కి నగుచుచు నిలు-

సేరితిని.

మాటకు ముందు కాలము చాలదనుట మనకిపు డలవాటు. విద్యార్థులకుఁ బాఠములు చదువఁ గాలము లేదు; విద్యావంతుల కితరుల కుపదేశించుట కవకాశము చాలదు; సేవకునకు నియమితమగు పని సేయను బొద్దు తక్కువ; అధికారికిఁ బ్రజల మొఱ లాలకించుటకుఁ దఱిలేదు; ధనవంతున కితరుల కష్టసుఖములు విచారింప వేళ యుండదు; మూఁడుగాళ్ళ ముసలికి "రామా! కృష్ణా" యనుకొనుటకే తీఱిక యుండదు.

కాని, కాలము చాలదని మనపూర్వు లెన్నితంటాలు పడుచుండినట్లు వినము. శ్రీరామ చంద్రు నంతటిరాజు జెట్టియల్పుని విన్నపముల నైనను సావధానముగ నాలించుచుండెనఁట. ఉపదేశించు వారున్నచో నింకెన్ని ధర్మములు పురాణములు వినుటకైన ధర్మరాజు కాలము చాల దనియుండఁడు. ఇదేమి కాని, పదునారువేల భార్యలతోఁ గాపురము సేయవలసివచ్చినను, శ్రీకృష్ణుఁ డెన్నఁ డును దీఱిక లేదనలేదు.

మఱి సృష్టికర్త మనల మోసగించి నలువది యెనిమిది గంటల దినము నిపు డిరువదినాల్గు గంటల దానిగ మార్చెనా? మార్పు జెందినది

మన యోగ్యతయే! వాస్తవముగ నుపయోగింప లేనంతఁ గాలము మన యధీనమున నున్నది. యంత్రమున కావిరిశక్తి గల్గినచో మన ముపయోగించుకొన్నను లేకున్ననుఁగూడ నది పని సేయుచుండును. వలసిన పనులఁ జేయింపనిచో మానవ స్వభావము మనచే వ్యర్థకార్యముల నేని జేయించునుగాని యూరకుండదు. ఇట్టి యభ్యాస మతిశయించుకొలఁది కాలమంతయు వ్యర్థకార్యాచరణమునకే సరిపోవుటంజేసి సత్కార్యములకు మన కప్పుడు "తీఱిక లేదు."

ఇంచుమించుగ నీయనర్థమున కంతయు మన నాగరకతయే నిదానము. అనాగరకుఁ డెన్నఁడును గాలము నిట్లు నిందింపఁడు. పని పరిమిత మగుటచే వానికిఁ జాలినంత యవకాశ మున్నది. పగ లంతయు నొడల నీరుట్టు నట్లుగ నాఁగేటితోఁ గష్టపడి పంట పండింపనున్న హాలికునకుఁగూడ కాలము సమృద్ధిగ నున్నది. అక్కర మాలిన పనుల నధికముగ నంటగట్టుకొన్న మనకు మాత్రమే యీ యవస్థ. తెల్లవారలేచి మధ్యాహ్నము దాఁక సబ్బునంటించుకొని త్రిప్పిత్రిప్పి చూచుకొనుచు ముఖముండనము చేసికొన మన వారికిఁ దీఱికయుండునుగాని మిత్రుని జాబునకు

మూఁడునెలలకేని ప్రతివ్రాయ నవకాశములేదు. అనవసరముగ నొకటిపై నొకటి యంగరఖాల దొడిగికొని మెడ "కజాగళస్తనముల" నతికించు కొనుటకును, కాలితిత్తుల బిగించుకొనుటకునే కాల మంతయు వ్యర్థమగుచుండ సద్వ్యాసంగమునకు గాల మెట్లువచ్చును? పరిచితులైననుగాకున్నను, త్రోవ నెదురయినవారితో నెల్ల నిరర్థకజల్పనలొన రించుచు, 'శాస్త్రులవారి గుఱ్ఱము'వలె నిలువఁబడు పెద్దమనుష్యు లితరకార్యము లెప్పుడు సేయనేర్తురు? తమ కళత్రములు, భవనములు, వాహనములు, ఆరామములు సంపదలునే సర్వోత్తమములనితలం-చి యందఱయెదుట నభివర్ణించుకొను మహనీయుల కన్యులసుఖదుఃఖములరయ విరామమెందువచ్చును? కాలమును బరుగెత్తించుటకై మితిలేని ధనవ్య-యమునేని యోర్చి చీట్లాడుచుఁ గృతార్థులగు వారి కిఁక పొద్దెక్కడిది?

పనిలేనివారి యాశకు నలువది యెనిమిది గంటల దినమైనఁ జాలునా? వీరికోరిక ననుసరించి సృష్టికర్త యట్లే తన కాలచక్రమునుమార్చ నను కొందము. ఈయసహ్యాలంకారములు, నీయసంబద్ధ జల్పనములు, నీయప్రస్తుతాత్మస్తుతిప్రసంగములు, నీయనర్థక వినోదములును స్వేచ్ఛగ, నిరాతంక

ముగ, యథావకాశముగఁ జరుగఁగలవు; కాని సద్వినియోగమున కపుడు గూడఁ దీఱిక యుండదు. ఇఁక నియమితముగ దమ పనులొనరించుకొని కాలము నుపయోగించు కొనువారి కపుడు గొప్ప కష్టము. ఇప్పటి యిరువదినాల్గు గంటలే చాలి యున్న కారణమున వారి కపుడు పని యుండదు.

ఇంతమాత్రము కాక సృష్టికర్త కపుడు మూఁడు గొప్ప చిక్కులు దాపరించును. ఆస్థాన శాలలలోను కార్మికాగారములయందును పగ లంతయుఁ బనిసేయవలసిన చిన్నియుద్యోగులును సేవకులును నిరంతరము నతనిందిట్టుచు శాపోదక ముల విడుచుచుందురు. కాలము గడుపలేని పు-ణ్యాత్ముల యుపయోగమునకై కొఱత వడకుండ చీట్లపేకల 'బస్తా'ల సిద్ధముచేసి పంపుటకు వేఱొక "అమెరికా" దేశమే సృష్టికావలసి యుండును. ఇంటఁ గూర్చుండి మగల వేధించితినుచు నేపని పాటలు లేక దినమున కిపుడు మూఁడు గంటల కాలమేని సద్వినియోగము సేయనేరని మన నాగరక తరుణీజనమునకై సృష్టికర్త యపుడేమి పని నిర్మింపవలసి యుండునో నే నింకను నాలో-చింపఁదగియున్నది.

"It is generally the *idle* who complain

they cannot find time to do that which they fancy they wish. In truth, people can generally *find time for what they choose to do*"

—SIR JOHN LUBBOCK.

---

## విద్య

విద్యా ప్రభావమును వర్ణించుచు భర్తృహరి కడమాటగ "విద్యావిహీనః పశుః" అని వచించెను. ఇది యాథార్థముగ విద్యావంతుల మనుకొనువారు విద్యాహీనుల నెంతో నీచముగఁ జూచుచు వారికన్నఁ దామొకమెట్టు పైనున్నట్లు భావింతురు. సంఘములో విద్యాహీనుల కెందును గౌరవములేదు. ఇట్టి యభిమాన మన్నిసంఘములలోను పురుషులయందే కాక స్త్రీలయందును ప్రబలుచున్నది. కాని నాకుం జూడ నిది యొక శోచనీయమైన దుర్న్యయము. విద్యావంతుల మనుకొనువా రితరులఁ జూచి నవ్వవలయునేల? పట్టుచీరఁ గట్టుకొన్న భాగ్యశాలిని యితరుల గేలి సలుపవలెనని ధర్మశాస్త్రమా? కొమ్ముకుప్పెలును చిఱు గంటలును గల వృషభ మెట్టిజతతో కాడి గట్టినను గొంచమైన యేవగించుకొనదు కదా?

కాని, నాకొక్క సందేహము—దానికిఁ గూడ విద్యనేర్పినచో నిట్టిగుణమే పట్టువడునేమో?

విద్యయనుమాట కెన్ని యర్థము లున్నవని వాదించినను సామాన్యముగ వ్రాత చదువులకే యది రూఢముగ నున్నది. పూర్వకాలమున సంస్కృతభాషలో సాహిత్యమునందో, శాస్త్రము నందో, పాండిత్యము గలవాఁడే విద్యావంతుఁడు. తదితరు లపుడు గౌరవమున కనర్హులు. అన్య భాషాజ్ఞానము గలవా రాకాలమున ననార్యులుగ భావింపఁబడిరి. ఇపుడో విద్యయనఁగా క్రమ క్రమముగ నాంగ్లేయ భాషాభ్యాసమునకే యన్వ యింపఁ బడుచున్నది. కాననే "ఎ. బి. సి." రాని వాఁ డెంతబృహస్పతి యయినను విద్యావంతులలోఁ బరిగణింపఁబడఁడు. అట్టివాని విద్య విద్యగాదు; బ్రతుకును బ్రతుకుగాదు అందఱవలె నద్దె యిచ్చిన తరువాత గూడ నతనికిఁ బొగబండిలోఁ గూర్చుం-డ తావుసయితము దొఱుకదు. వీరిలో నెవరు నిజముగ విద్యావంతులు?

ఇంతియగాదు. ఒకరి విద్య యింకొక్కరి కవిద్య. వేద వేదాంతముల సారమెఱింగిన సాత్త్వికుఁడు శుద్ధముగ మాతృభాషనేని మాటాడ నేరని మన విద్యార్థులంజూచి గొణఁగుకొనుచు

మొగము చిట్లించుకొనును. "షేక్స్పియరు" నాటకముల నారస్య మెఱిఁగిన నవనాగరకుఁడు రాజ భాషరాని శ్రోత్రియునిఁ బరిహసించును. మంగలిరంగనిపాఠము వచ్చినంత నవనాగరిక బాలిక మడి గట్టుకొని గోపికాగీతలు పాడుకొను ప్రాత ముత్తైదువఁజూచి గేలిసలుపును. ఈ యిరు తెగల విద్యావంతులును బల్లెలలో నెవరి జోలియు లేక 'నాగేలే నావిద్య' యనియున్న హాలికుని నెచపుచూపు చూతురు. కాని వాఁడీ ప్రాత విద్యల నధిక్షేపింపలేదు; క్రొత్త విద్యల హాస్యము సేయనులేదు. వానికి రఘువంశముపైఁగాని, "షేక్స్పియరు" నాటకముపైఁగాని ద్వేషము లేదు. భారతమును వానికి నిజమే; బైబిలును సత్యమే. ఘృతమునకుఁ బాత్రి మాధారమా, పాత్రిమున కాధారము ఘృతమా, యని తల పగులఁ గొట్టుకొను పండితులును, రాలిన పండు నేలఁబడుట నేలగుణమా? పండు గుణమా? యని కూడునీరువిడిచి చింతించు శాస్త్రజ్ఞులును వానికి సమానులే. ఈచదువు రామిచే వాని కితరుల గొడవ యక్కరలేదు. వానిది వేఱువిద్య.

ఈహాలికునికుండు సమబుద్ధియు, సహన-

మును మనకు లేకుండుటకు మనలోపమా? కాక మన విద్యల పాపమా? కాదు. మనము చదువు నేర్చితిమి కాని వివేకము నేరువలేదు. విద్య తెలివి నిచ్చును; వివేకము తెలివికి మంచిత్రోవ సూపును. మొదటిది సాధనము. రెండవది ఫలము. లభించిన సాధనమును మన ముపయోగ పఱచుకోనఁ జాలమైతిమి. కత్తి చేతఁబట్టినపుడు మనుజుఁడు శత్రువుల ఖండించి కీర్తి నార్జింపవచ్చును. సరికదా తనముక్కు చెవులనేని కోసికొని నల్గురిలో నగు బాట్లును గావచ్చును. మనముగూడఁ జదువు నిట్లే యుపయోగించుకొను చున్నారము. ఇతరుల మేలునకుఁ గాకున్నమానెగాని, మన విద్య పొట్టకు బట్టకునుగూడఁ జాలదు. మఱి దీని యుపయోగమితరులఁ దప్పుపట్టనే! కాననే యొక పండితుఁడు "విద్య వివాదముకొఱకే" యని సెల విచ్చెను.

వివేకమునేర్పని విద్యవ్యాసునికడ నేర్చినను వ్యర్థమే. వివేక మక్కఱలేనివాఁడు సకలవిద్యలను సాష్టాంగ ప్రణామములతో సాగనంపవచ్చును. పుణ్యమునకును పురుషార్థమునకును రాని విద్య బుద్ధికిఁ గష్టమేకాక నూనెకును నష్టము. మూర్ఖుఁడు తానొక్కఁడు చెడినఁ జెడవచ్చును. అవివేకి

తోడివారింగూడఁ జెఱచును. మోటువారి రాక్షస కృత్యములచే నొకరిద్దరు మరణింపవచ్చును గాని, కోట్లకొలఁది నిరపరాధులు యుద్ధరంగమున నకాలమరణము పాలుగారు. సామాన్య ధర్మములలో రుచిలేక విశేషధర్మము లెఱుఁగక యందు నిందుఁ గొఱగాని యవివేకులగు చదివినవారికన్న నపండితుఁడే మేలని ప్రపంచతత్త్వవేత్తల మతము. అగుటం బట్టియే,

చదివినతనికన్న చాకలిమేలురా!
విశ్వదాభిరామ వినరవేమ॥

యను వేమన బంగారంపుఁ బలుకులు!

చదువు మంచిదే యని యొప్పుకొన్నను మనవారు దానినభ్యసించు విధమైన నీయనర్థమున కెల్లమూలమనక తప్పదు. మోటుదన మగ్నిమాంద్యమువంటిది. ఆ రోగముగలవాఁడు మితాహారమునఁ గాలముఁ గడుపవచ్చును. మందు కలదుకాని నియమితకాలము దాఁక యపథ్య దోషములేకుండ సాధించినచో నది యారోగ్యమును తప్పక ప్రసాదించును. అటుగాక కొన్నాళ్ళుమాత్రము సేవించి యనాదరము చూపినచో నాఁకలిహెచ్చి తిండి కారాట మధికమగును; గాని జీర్ణశక్తి పూర్ణముగ రానికారణమునఁ

గడ కతిసారరోగము నంటఁగట్టును. ఆగ్నిమాంద్యమున నారేండ్లు బ్రదుకఁగలవాఁ డతిసారమున మకరసంక్రమణమున కెదుఱు సూచుచుండును. అల్పవిద్యయు మోటుఁదనము నించుక తఱచి విడుచుటచే బుద్ధి కొక్కింత యుత్తేజనము గలిగి చిక్కినది కబళింప నాసవొడమును; కాని యరగించుకొను శక్తి యుండమి నవివేకము ముదిరి మనుజుఁడు రెంటికిం జెడిన రేవణయగును. "చదువ వేయ నున్నమతియుఁబోయె" ననులోకోక్తి యిట్టి చదువునుఁ గూర్చియే!

మన పాఠశాలలలో బాలు రిట్టివిద్యనే క్రయమునకుఁ గొనుచున్నారు. పూర్ణపాండిత్య మీకాలమున ననేకుల కందరాని పండు; కాననే హంస కాకున్నమానె, కాకియుఁ గాని దుస్థితి సమకూరినది. ఇంతియకాదు. ఎవరేమి చెప్పిన నేమియును సహనముండదు. తమంత విషయము నిర్ధరించుకొను శక్తిలేదు. నిజ మరయగోరి పాటు పడ నోపిక రాదు; ఇతరుల యుపదేశమగ్గము కాదు; మూఢభక్తికి నేర్చిన చదువు చోటియ్యదు; నల్గురిలో మాటాడకున్న నభిమానము విడువదు. పరిణామమిదియ.

ఇట్టి విద్యావంతు లితరుల హీనపు చూపు

చూచుటకన్న నగుబాటుకలదా? ఇట్టి జ్ఞానము కన్న మౌఢ్యము హృదయంగము కాదని యే వివేకశాలి యనఁగలడు?

"Little knowledge is dangerous."

---

## బిరుదయుగము

## ౬

ఇరువదవ శతాబ్దము నెవ రేయుగమన్నను నామతమున నది బిరుదయుగము. తలతోఁక లేని బిరుదములఁ గోట్లకొలఁదిగ ననుదినమును వార్తాపత్రికలలో నిపుడు వినుచున్నారము. అం-దును నౌదార్యమున కాటపట్టయిన మన యాంధ్ర దేశమున నవి కాసునకు గంపెఁడు! కాగితములు కరవై గడియ యొక గండముగ నున్న యిప్పుడు సయితము దేశపత్రిక లెడప దడప తీఱిక కల్పించుకొని నెమ్మదిగ రెండుపుటలయిన నీ స్తుతిపాఠక లేఖకుల వ్రాఁతలకుఁ జోటియ్యవలసియే యున్నది. ఇతర విషయము లటుండ కవితా విషయమున నీ యాచారమునకు మట్టు మర్యాదలే లేవు. పదునాఱవ శతాబ్దమునఁ గృష్ణదేవరాయని 'భువన విజయ' మహాసభలోని యష్టదిగ్గజములలో నెల్ల

నొక్క యల్లసాని పెద్దనకు మాత్రి మే గ్రహ బలముననో యొక బిరుదము వచ్చెను. మహా కవులగు వ్యాస వాల్మీకి పాణిని కణాద కాళిదాస భవభూతి హర్షాదుల కొక్కొక బిరుదమేని లభింపఁ లేదు. ఇఁక నేటి స్థితిఁ బరికించితిమా, శనిచాలని యే ముగ్గురునల్వురో తక్క పేరునకు ముందో వెనుకనో యొకటి రెండయిన బిరుదవాక్యముల నంటించుకొనని వ్రాయసగాఁడే యరుదు. కవియే యసంభవము; గ్రంథకర్తయే లేఁడు.

ఆశుకవులు, బాలకవులు, కవిరాజులు, శతావధానులు, మనకు సులభముగ నర్థమగుదురు. కాని యీకాలపు బిరుదము లింతటితో ముగియు నవి కావు. ఆవాక్యములసృష్టి యొక విచిత్రపు పద్ధతి. ఈబిరుదములకై సరస్వతి బాల్య కౌమార యౌవన వార్ధకములలో ఢుణమొక యవస్థతోఁ దన్నుకొనుచు గిజగిజ లాడుచున్నది; సంస్కృత కవులు పాప మేయేదేశమువారో యాంధ్రులై యవతారమెత్తవలసిరి; ప్రాచీనులుగూడ 'నభినవ' జన్మకష్టముల ననుభవించిరి; చాలదని యాంగ్ల దేశపు కవులును, నాటకకర్తలును దెలుఁగువారై యిందుఁ బుట్టసాగిరి; ఇవన్నియునుండ సింహ శరభ గండభేరుండాదులును బిరుదావళి కెక్కవలసి

వచ్చెను. ఇక మూషికమార్జాలాదుల వంతు గూడ నింతలో రానున్నదేమో!

ఆంధ్రవ్యాసుడింతలో రానున్నాడు. అభినవతిక్కన యీవరకే యున్నాడు గాబోలు. ఆంధ్రపరాశర, ఆంధ్రగౌతమ, ఆంధ్రబ్రహ్మలును సిద్ధముగ నున్నారు. షేక్స్పియరు స్కాట్టులు చేసిన పుణ్యమేమి మాపాపమేమి, యని గోల్డుస్మిత్తు, మెకాలే, మాక్సుముల్లరులు కోపగించుకొన్నారనుకొందును. అభినవదండి బిరుదము కేతన యపహరింపక పోయిన నిప్పటి కెందరో గ్రుద్దులాడుకొని యుందురు. ఆంధ్రకాళిదాస బిరుదమును గూర్చి చాలమందికి కేశాకేశి బాహాబాహి యింతలో జరుగునని నాభయము.

ఈకళ యింకయు నాడువారి కంతగా పట్టుపడలేదు కాని, యున్నచో, నీవఱకే యభినవకుమ్మర మొల్ల, నవీనముద్దుపళని, ఆంధ్రబిసాంటుగా నవతరించియే యుందురని నానమ్మకము. మగవారు కొల్లలుగ బిరుదముల ధరించియుండ వారు మాత్ర మూరకుందురా? వారికిమాత్రము తగిన శక్తిలేదా?

కొన్నాళ్ళవెనుక నొకశాస్త్రిగారి 'శాంధ్ర బృహస్పతి' యను బిరుదువచ్చెను. వారు పూర్వ

పాండిత్యముగల్గి నిరంతరము పలువురు శిష్యులకు సాత్త్వికవిద్యాదానము సేయువారుగాన పురజనులు వారి నా బిరుదమున గౌరవించిరి. కాని, తాను మాత్రి మనామధేయురాలుగ నేలయుండవలెనని పట్టుబట్టి వారి జాయ కొన్నిదినములలోనె కడు ప్రియాసతో తనపూన్కి నెఱవేర్చుకొనియెను. లోకు లామెకు 'ఆంధ్రతార' యనుబిరుదమియ్యక తప్పినదికాదు.

నేఁడుదయము దపాలావాఁడు పుస్తకము నొకటి దెచ్చి యిచ్చెను. అది యాంధ్రికాళిదాస ప్రహసనము; వృద్ధసరస్వతి కొండలరాయశర్మ ప్రణీతము. అభిప్రాయార్థమై మాకార్యస్థాన మలంకరించినది. పుటత్రిప్పిచూచితిని- పీఠికపుట 1, అభిప్రాయములు 24, విన్నపము 57, గ్రంథారంభము 64, ప్రకటనలు 68. అనివిషయసూచిక యున్నది. సరే గొప్పగ్రంథమె యనుకొని పీఠికను రుచిచూచితిని.

"పండితులారా!- శనిగ్రహస్తుతి తెనిఁగించి యాంధ్రిశని యనియు, కలిపురుషుని తైలాభిషేక వ్యాఖ్యకు టిప్పణము వ్రాసి యాంధ్రకలినాథుఁ డనియు, ఆంధ్రినామ సంగ్రహమున కనుక్రమణిక గూర్చి నవీన వాగనుశాసనుఁడనియు బిరుదముల

నొందిన యీవృద్ధసరస్వతిగారి కృతికిఁబీఠిక వ్రాయఁ గల్గుట నాయదృష్టమే!"

అని యేమేమో రామాయణమంత యున్నది. కడకొక బి. ఎ. గారి వ్రాలుగలదు.

గ్రంథము సగము చదివినట్లే! కానిమ్మని యభిప్రాయముల వంక నవలోకించితిని. నూర్లకొలది యభిప్రాయదాతలు గలరు. కొందరి నామములు మాత్రము వ్రాసెదను.

1. ఆంధ్రశుక్రాచార్య, అభినవాంధ్ర సాక్రటీసు, వీరభద్రకవి
2. ఆంధ్రనాటక వృద్ధప్రపితామహ, అభినవ షేక్స్పియరు రమాకాంతరావు;

'ఆంధ్రనాటక పితామహ' బిరుద మీవఱకే 'ఖర్చు'పడిపోవుటఁజేసి వీరికీ వృద్ధత్వము.

3. వచన వాచస్పతి, రామానుజరావునాయఁడు;
4. చారిత్ర్య మాతామహ, సాంబకవి;
5. నవలామన్మథ, శిశుకవి పోతిరెడ్డి;
(వీరు దినమున కొక నవల వ్రాయఁగలరఁట!)
6. గద్యభాస్కర, కవిబ్రహ్మ, మహేశ్వరకవి;
7. శ్రీమాన్, విద్వాన్, అపశబ్ద శిరోమణి రసగంగాధర, వ్యాకరణ కుఠార, దొడ్డప్పాచార్యుఁడు;

8. చతుర్వాణీ భుజంగ, సాహిత్య పతంగ, వేణీనాథకవి;

(వీరికరవ మింటిభాష; హిందూస్థానీ కన్నడము లించుకవచ్చును; తెలుఁగు నీవలనేర్చిరి; ఏఁడాది నుండి కవన మారంభమయినది.)

9. అనధాని రావణాసుర, తర్కతీర్థ, అక్బర్ జిహాంగీరు కవులు;

10. కవితాహంకార చక్రవర్తి, వాగ్దేవీ భయంకర, తిట్టుకవిభూషణ, ఘటికాశతాక్షర గ్రంథకరణనిపుణ, మిథున కవులు.

ఇంక, ఆంధ్రపాణిన్యాచార్య, నిమిష కవి శిరోమణి ప్రముఖులు పెక్కండ్రుగలరు.

ఇచ్చటికి గ్రంథపరీక్షయయినది. నాయభిప్రాయ మొక్కటె కొదవ!

ఇంతలో విద్యాప్రియరావు (ఇదియు బిరుదమే!) నాగదినలంకరించి, యీగ్రంథము నందికొని కటాక్షించి కవన ధోరణి మెచ్చుకొని తలయూఁచెను. కవులకుఁ గానిచ్చియొఱుఁగకున్న ను బిరుదదానములో నితఁడభినవకర్ణుఁడు. మే మీ విషయమును గూర్చియే ప్రసంగించు చుండుసంత, యిరువురు బుడుబుడుక్కలవారు వచ్చి వాఁకిట నిలిచి పినాకినీ ప్రవాహముంబోలు నాశుధారతో

గద్యపద్యరూపముగ గ్రుక్కతిప్పక చెరి యొక పాదముం జెప్పుచు నతనిపై కవనము గ్రుమ్మరించిరి. ఆ జంటకవుల ధోరణికి నే నద్భుతపడితిని. రావుజి గా రిట్టె కోఊ తెరచుకొని వినసాగిరి. ఆ యాశుకవితలోం గొన్ని పంక్తులు మాత్రము నా స్మరణలో నున్నవి.

“ఉదవాకమే బుడుబుడుకా
అమృతపుపలుకే పలికీని

*  *  *

ఒక్కమాటనే నిక్కడ చెప్పెద
నిక్కముగానది నడచీని
ఈ దిక్కులోననొక చక్కని చిన్నది
నిక్కినిక్కి నినుజూచీని
ఆ-యక్కసాయగము టక్కుగాదు మీ
చుక్కలరాయఁడు మెచ్చీని
ఆ-ఇక్కలుగలిగిన మక్కువతో నా
దిక్కుసీమనును తిరిగీని
ఆ-సక్కెరబొమ్మను పెక్కులేలయీ
వక్కలాకులే తెచ్చీని
ఈ-వక్కాకా మెకు నిక్కముగా మది
తిక్కతనము నెత్తించీని
వే-రొక్కటిచూడక తిక్కముదిరిసీ

పరీక్షకుతానై వచ్చీని,
ఆ-చుక్క నీయెదకుఁ జిక్కినంత బుడు
బుక్కల తిమ్మఁడు నవ్వీని"

విద్యాప్రియుని యానందము పార మెఱుంగదు. అతఁడు "సెబాసు"ల వర్షించుచు నీధారాముగిసినంతఁ దనపైనున్న 'శల్లా' నట్టె వారిపైఁ బారవైచి, యొక పత్రికలో నీబిరుదముల వ్రాసి బహుమతిచేసెను.

"బక్కపెద్దు భయంకర గంగిరెద్దులు, గ్రుక్కుత్రిప్పని గురులింగలు, వచనకవి చౌడప్పలు, గ్రామసింహులు, సరస్వతి మేనమామలు."

---

## హాస్యకళ.
## ౭

సందు గొందులలో వినఁబడు నపవాదములను సరకు సేయక మరల వీధులలో నెప్పటియట్లె మీసాలు దువ్వుచుండుట నేఁటి మహాపురుషుల లక్షణము. మొగమెదురుగ నీయం దీలోపమున్నదని వచించునంతటి దుర్ముఖులును, నేఁడరుదు. ఎదుటఁ బొగడుట, మఱుఁగున నేదో యున్నదానినో లేనిదానినో యూఁతఁ జేసికొని తెగడుట,

యిప్పటి సదాచారము. పుట్టిన తరువాత గిట్టు లోపలఁ గొందఱభినందించినను మఱికొందఱిచేనైన నపవాదపడక తప్పదు. మా 'వదరుఁబోతు' ఇప్పుడే పుట్టియున్నను ఇంతలోనే దానికి నపవాద మొకటిరాక తప్పినదిగాదు. అదియు నందు గొం-దులలో వినఁబడునదే యైనను, మేము మహా పురుషులముగాము గావున దానిని సరకుచేయుట యొక యవలక్షణము గాదనుకొనెదము.

అపవాదము రెండు దెఱఁగులు. మిథ్యాప వాదము సత్యాపవాదమునని. అందు (౧) ఉన్న దానిని లేదనుట (౨) లేనిదాని నున్నదనుట యని మొదటిది ద్వివిధము. (౧) ఉన్నదాని నున్నదనుట (౨) లేనిదానిని లేదనుటయని రెండవదియు రెండు దెఱఁగులు. ఉదారహృదయులగు మాచదువరులు ద్వివిధమిథ్యాప వాదములనుగాని మొదటి సత్యాప వాదమునుగాని మాపై మోపలేదు. లేనిదానినే లేదన్నారు. అదియుఁబూర్తిగ లేనిదిగాదు. లేని దానివలెఁ గానవచ్చునది. 'వదరుఁబోతు సర్వ విధములఁ జక్కఁగ నున్నదిగాని యొకటిమాత్రము తక్కువ' అదేమనఁగా 'హాస్యము'!

ఒకకథ యీసందర్భమున స్మరణకు వచ్చు చున్నది. త్రేతాయుగమున రామచంద్రుఁడు లం-

కను జయించి మరల విమానమున సీతాదేవితోడ నయోధ్యఁ జేరవచ్చుచుండెను. ఆతని యాగమనమును తొలుతనే హనుమంతుని మూలమున విని, యంతకుమున్న తాము పలుమాఱు వినియున్న సీతాసౌందర్యమును బరీక్షించుటకై తార, రుమ మొదలగు వానరనాయికలు కుతూహలమున మాల్యవంతపు శిఖరముపై వేచియుండిరి. వానరసేనతోడ సీతారాములును వచ్చిరి. కుశలప్రశ్నాదిసమయమున సీత నాపాదమస్తకము సూక్ష్మదృష్టితోఁ బరీక్షించి తార, తుదకు 'అయ్యో పాపము' అని వగచెను. తక్కిన చెలికత్తియలు కారణ మడుగఁగా "చూచితిరా! దేహము బంగారువన్నె; కన్నులు విశాలములు; ఎత్తయిన నాసిక; రోమరహితములైన యంగములు! ఇట్టి సౌందర్యవతిఁ బడయుటకు భర్త యెంతో పుణ్యము చేసియుండవలయును. నిజమే, కాని సీతకు మనవలె కుఱుచగనో గొప్పగనో తోఁకయొకటి యున్న నెంత బాగుగా నుండియుండును! అన్నిలక్షణములును ఒకచో నుండవుగదా!" యని పలికెనట!

ప్రకృతము మేము సంపాదించుకొన్న యపవాదము నిట్టిదే. పదమూఁబోతు ప్రకాశమునకు వచ్చుటకేది యుద్దేశమో దానికిని హాస్యమునకును,

'సౌందర్యమునకును తోఁకకునుగలయంత దూరము లేకున్నను, గొంతమైన దూరముగలదు. చర్చింపఁ దగినవానిని చర్చించుట, ఖండింపఁదగినవానిని ఖండించుట, పొగడఁదగువానిని బొగడుట, తనూన్మా- లమున విషయములఁగూర్చి మాయొక్కయు సా- మాన్యులగు చదువరులయొక్కయు భావనాపథ మును విశాలముగా నొనర్చుట, ఇత్యాదులు మా యుద్దేశములు. ఇవి మా ప్రయత్నములని వచిం- చెదముగాని ఫలములని వచింపము. మాపత్రిక నందుకొని నెమ్మదిగా నిదానముగా చదువుకొని 'ఫరవాలేదు' అని యభినందించుట మాకుఁజాలు- ను; కాని రాకమునుపే యెదురుచూచుచుండి వచ్చిన తోడనే గడ గడమని కార్యకారణ భావ ములను గమనింపక యొక్క గ్రుక్కగాఁ జదువు కొని పక్కుమని పదిమాఱులు నవ్వి, తరువాత నదేకాగితమునే మేజాపైని మైలఁ దుడుచుట కుప యోగించువారి కొఱకు మా ప్రియత్నముగాదు. అనఁగా హాస్యరసమునే సంపూర్ణముగ వదలుట మాయుద్దేశముగాదు. ఒకరిని నవ్వింపఁ బ్రియ- త్నించుట మనుష్యజాతి సహజములగు లక్షణ ములలో నొకటి. కావున దానిని మేమును వదలలేము. మఱియుఁ గొంత దుర్గ్రిహమైన

విషయచర్చలోఁ బ్రవేశించిన మెదడు నడుమ నడుమ నేమైన నంజుకొనకున్న కార్యముసాఁగదు. మాకు హాస్యరసమువలని ప్రయోజనమంతే; కాని, నవ్వుటయే జీవితమున కాధారమనియు, ఆరోగ్య కరమనియు, నెన్నిమాఱులు నవ్విన నన్నిదినము-లో గంటలో యాయువృద్ధియగుననియు నపూర్వ సిద్ధాంతములఁజేయు హాస్యరస దేవతలను దృప్తి పఱచు సామర్థ్యము మాకులేదు. మేమును మాచదువరులవలె మనుష్యులలో మనుష్యులము గానేయుండగోరెదముగాని వారిపాలిటి బ్రహ్మలము గావలయునని సంకల్పింపలేదు. కారణమేమనఁగా బ్రహ్మపదవి నధిష్ఠించితిమేని తరువాత మాకింత పత్రిఁబెట్టువారును లేకపోవుదురేమోఅనుభయము.

మనవారికి హాస్యరసముపై నేల యింత యభినివేశము? కారణమున్నది. చదివిన చదు వంతయు బ్రతుకునకై వినియోగించి పరులకు దాసులయిన వారి బ్రతుకే హాస్యము! కాక, పగ లంతయు దమ కిష్టములేని పనియందో చేసఁగాని చేతయందో కడపుచుందురుగావున మేధస్సంతయు నీరసమై యుండును. కావున నూతనవిషయములఁ జర్చించుటకుఁగాని చర్చించువారి హృదయములతో నేకీభవించుటకుఁగాని యోపికయుండదు. అట్లగుట

విరామ కాలములందు వారికిఁగావలసినది నవ్వులు, నవ్వించుట, కాని వ్యాసంగముగాదు. మఱియు విద్యకు జ్ఞానము ఫలముగాక, పరీక్షలోఁ దేరుటయును, దానికి జీవితములను గుణకారము చేయుటయును ఫలములుగా నేర్పడుటచే నేఁడు స్వతంత్ర వ్యాసంగపు వాడుకయే తప్పినది. ఇందుచే మన మాలోచించునదంతయు భూతభవిష్యత్తుల సంబంధములేని వర్తమానకాలము. ఇతరులపని చేసి చేసి విసిఁగి, చేయవలసిన మనపని యేదియుఁదోఁపక, వేసరియుండు నద్యఃక్షణము సంతోషముగాఁ గడచినఁజాలును. కాని, నందుని రాజ్య మిదివఱకైనదో యిఁక ముందు గానున్నదో యనుజోలి పనిలేదు. కావున నిన్నటి పశ్చాత్తాపములును రేపటి భయములును మనకంటవు. మనకుఁగావలసినది నేటి నవ్వు. ఇది రేపటికేడ్పై పరిణమించినను సరే!

నవ్వువారెందఱున్నారో నవ్వించుమార్గములు నన్ని గలవు. కాని యవి యొండొంటికి మిత్రములు గావు. ఒకరి నవ్వుతో వేఱొకరి నవ్వు సమసింపదు. వారినవ్వు వీరికిఁగోపము. ఇంకొకరికి రోత. వేఱొకరికేమియుఁ గాని వెట్టిపని. మఱొకరికి విప్పరాని బ్రహ్మముడి. దృష్టాంతమునకు దూరముపోఁబని లేదు. మా 'వదరుఁబోతు' నామధేయమే చా-

లును. దీనినిజూచి కొందఱు పకపక నవ్విరి. కొంద అధరోష్ఠముల ముడిమైన విప్పక గంభీర ముగాఁ దిలకించిరి. మఱికొందఱు 'ఇదేటి పాడు నేరు' అని యసహ్యపడిరి. ఈ మూవురి భావము లర్థముగాక బాలురు గొంద ఱెగాదిగఁ జూచిరి; ఇందఱను నవ్వించుట కేమిమార్గము? ఒకటున్నది. అదేమనఁగా నిందఱినినవ్వింపఁ బ్రయత్నించుటయే.

కాబట్టియే మావదరుఁబోతు ఇన్ని చిక్కు-లకు లోఁబడిన హాస్యమునుగూర్చి యౌదాసీన్యము వహించినది. పూర్తిగా మౌనము వహింపలేదని మాచదువరులలోఁ గొందఱైన నెఱుఁగుదురు. ఇంతమాత్రమునఁ బొట్టనిండని హాస్యభోజనులగు మాచదువరు లెవరైన నున్న వారికి మామనవి యొకటి. తానుబెట్టకున్నను పెట్టుచోటు చూపుట మానవ ధర్మముగదా! హిమవంతమునకు నావల నెందో యొక పర్వతమున్నదని పురాణములు నుడువుచున్నవి. దాని పేరు హాస్యపర్వతమఁట! అది యిచ్చోటనే కలదని నికరముగాఁ జెప్ప నంతటి పౌరాణిక భూగోళజ్ఞానము మాకులేదు. మాచిరంజీవి వ్యాసుని విచారించి కొంత కష్టపడి మైనను చదువరులు దానిని గనిపెట్టుదు రేని యది

వీరువారనక యందఱను నిజముగా కడుపులు పుండు పుండగునట్లు తుదవఱకు నవ్వించునఁట!

---

అనుకరణవిద్య

౧

సృష్టి ధర్మముల గుఱించి విపులముగ నాలోచించితిమేని. ప్రాణికోటికిఁ బరానుకరణము స్వభావమనుట స్పష్టముగ గోచరింపకమానదు. ఏవిద్యకైన గురుఁ డవసరమేమోకాని, యగ్ని కుష్ణమును నీటికిశీతమునుబలె నీకళ మనకుఁ బ్రకృతి సిద్ధము. ఇహలోకయాత్రకై సృష్టికర్త మన కొసంగిన పాథేయమిది. తల్లిగర్భము వెలువడి ధరాగర్భము సొచ్చునందాఁక మనమభ్యసించు విద్యలును, నేర్చు నడవడికలును సంపాదించు సాంగత్యములును, ప్రకటించు భావములును, చూపుగుణములును, అన్నియుఁ గొంచెముగనో గొప్పగనో తన్మూలముగనే మన కలవడుచున్న యవి. మనమేవిధముగ నేమినేర్చుకొన్న నేమి యది ప్రకారాంతరముగఁ బరానుకరణమే. ఇతరుల యాశయముల నెఱింగి, వాని ననుకరించుటచేఁ గాకున్న మనము పుట్టినవారు పుట్టినట్లేయుండి ప్ర-

పంచమునంతయు ఋష్యశృంగమయముగా నొస రించి యుండుమేమో?

మనుజుని జీవిత పరిణామమునకిది యిట్లా ధారభూతమగుటంజేసి యేతద్విషయమున మన మెంత జాగరూకతతో మెలంగినను నెక్కువయన రాదు. ఛాయాపటమును దీయుటకై సిద్ధముగ నమర్పఁబడిన దర్పణ ఫలకమువంటిది మానవ హృదయము. సమయమునకై వేచియుండి బింబ మునకు యుక్తదూరమునఁ దగుపద్ధతిని దర్పణము నుంచమేని ప్రతిబింబము పాడయి యనుపయోగ కరమగుననుట మనమెఱుఁగనిది కాదు. ఇతరుల స్వభావాదుల ననుకరించుపట్ల మనమును విచ్చల విడిగఁ బ్రవర్తించినచో, జేకూరు ఫలసిద్ధియు నట్టిద. తగని యాదర్శములఁగైకొనుట యటుండ సదాదర్శముల ననుకరింపమి కూడ మన జీవిత మును జుక్కానిలేని యోడం జేయును. కావుననే చిన్ననాటినుండి సత్సాంగత్య మలవడుట యదృష్ట ఫలమని పరిగణింపఁబడుచున్నది.

అతివిస్తృతమగు నీప్రపంచమున లెక్కకు మిక్కిలి యగు గుణములును స్వభావములును నిరంతరము మనచుట్టును గోచరములగుచుండును. వానిలో మన స్థితికిని, అర్హతకును, దేశకాల

పరిణామములకును దగినవాని నేర్పఱచికొని గ్రహించి యుక్తరీతి నుపయోగించుకొనవలసిన భారము మనదియ. వంటచెఱుకులకై పోవుచు త్రోవలో దుకాణమున నున్నవాని నంతేయు బేరమాడుచు నిలుచున్న వాని నున్మత్తుఁ డనక తీరదుగదా.

సంఘమున నిపుడు కానవచ్చు ననర్థము లెన్నియో యించుమించుగ ననుకరణ విషయమున మనము చూపుచున్న యశ్రద్ధ వలననే కలుగుచున్నవనుటతప్పుకాదు. ఈవిషయమున ననాగరకులగు పల్లెటూరివారి జాగరూకత— తెలియని జాగరూకత యన్నను మానేఁగాని— యెంతయు శ్లాఘాపాత్రము. చిరకాలముగ వారికలవడిన యభ్యాసములపై వారికెంత దృఢప్రీతియో, నూతనవిషయములపై వారికంత యనాదరము. తృప్తికరముగఁ దమకది యుపయోగకారి యని పలువిధములుగ వారు నమ్మగలిగిననే తప్ప యెండ యెన్నియుపన్యాసము లిచ్చినను దటాలున నితరుల ననుకరించి నూతనమార్గముల నవలంబించి చిరాభ్యస్తముల విడనాడరు.

కాని, ప్రకృతిదత్త యయిన యీయనుకరణశక్తిని శక్తివంచనలేకుండ సంపూర్ణోపయోగమునకుం దెచ్చినవారు మన నవనాగరకులే.

॥తాతస్య కూపో య మితి బ్రువాణో
క్షారం జలం కాపురుషాః పిబంతి॥

అని యితరులఁ దూలనాడుచు క్షణమున నొక వేషము వేయుచు, దినమున నొక వ్యాపారము సేయుచు, నూసరవెల్లులవలె మార్పుచెందు చుండుట వీరిలక్షణము. ఈ యన్నల యనుకరణ విద్యకు విధినిషేధములును కాలదేశములును మంచి చెడుగులును లేవు. నేఁడొకఁడు పొరఁబాటుననైనఁ దలపాగా నొరగఁజుట్టినచో రేపటి కప్పుడే నూర్గుర తలమీఁద నొరపాగా లుండును; నేఁ డొకఁ డు బుసుపోక యన్యదేశీయులఁ బలె దుస్తులధరించెనేని యెల్లుండి వేయిమంది "నల్లదొరలు"గా నుందురు; చక్కఁజేసికొన నవకాశములేని సోమరియొకఁడు నేఁడు జుట్టుఁగత్తరించెనేని మఱుదినమున ననేకులకు శిఖభారమే; నేఁ డొనిబెసంటమ్మవిచ్చేసి బహిరంగముగా దివ్యజ్ఞానతత్త్వమును గూర్చి పలువిధములుగ నుపన్యసించవనిండు; రెండుమూడు దినములలో నేయక్షరజ్ఞుని మేజపైనఁ జూచినను, ఏ విద్యార్థి యంగరఖా జేబులోఁ గన్నను గూడ నొక చిన్ని "భగవద్గీత" పుస్తకమే! ఇంతటితోఁ బోయె ననుకొనరాదు. తరువాత నొక "మహమ్మదు" సాక్షాత్కరించి మోక్షమార్గమునకెల్ల నెత్తినున్న

శిఖయే మిత్రియని బోధించెననుకొనుడు-నామాట నమ్మకున్న నాయత్నము చాలదు కాని-నెల రెణ్ణెలలలోనే పురుషప్రపంచమున నూటఁ దొం-బదిమంది నున్నని తలలుగిలిగి గడ్డములు నిమురు కొనుచుందురని నాదృఢవిశ్వాసము.

మన స్త్రీలుగూడ నీజాడ్యమునకు లోను గాకపోలేదు. వారియలంకార పద్ధతుల గుఱించి క్షణమాలోచించినచో నామాటలోని సత్యము మనమున స్ఫురింపక మానదు. వివరణమునకు నేఁడు నాకవకాశముచాలదు గాన మఱల నెన్నఁ-డైన జూతముగాక.

మఱి యొక్కటి! పరుల ననుసరించుట మన స్వభావమే కాని కంటఁబడినవానినెల్ల యనుసరిం-చుట సామాన్యముగ మనలక్షణముకాదు. ఏ బిచ్చగాఁ డేమిచేసిన నదిచూచివచ్చి యనుసరించు పిచ్చివాఁడుండఁడు. మండలాధిపతి దేవాలయము నకు వెళ్ళువాఁడైనచో నిఁకనా దేవతకు గురుబలము సంపూర్ణముగఁ గల్గినట్లే. న్యాయాధికారి సంధ్య వార్చునని యెఱింగినచో న్యాయవాదులెల్లఁ ప్రాతస్నానము లాచరింపక యిలు వెలువడరు. బడిపంతులు కుస్తీచేయువాఁడైనయెడఁ బాలురు జెట్టీలుకాఁగోరుదురు. ప్రపంచధర్మ మిట్టిదనియే,

యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదేవేతరో జనః
అని శ్రీకృష్ణమూర్తి యానతిచ్చె. కాన సంఘమునఁగల లోపములకును సత్స్వభావములకును దాదాపుగ శ్రేష్ఠులే నిదాన మనవచ్చును.

చెప్పవచ్చిన దేమన—సంఘము బాగు పడవలెనన్న,

"గ్రుడ్డియగు నెద్దు జొన్నంబడ్డవగిది"

కాక, రసస్వభావముల ననుసరించువట్లు మనము యుక్తాయుక్తముల నరయుటయు గొప్ప వా రనిపించుకొనుచుండు వారు తమ యవలంబించు వేష మత స్వభావాదులలోఁ గడుజాగరూకత వహించుటయును నత్యావశ్యకములనుట!

---

## స్వీయచరిత్ర.

నేటి యుదయమున నా సంపాదకుఁడు నాకీ క్రిందిజాబు నొసంగెను.

"ఆర్యా!

'పదరుఁబోతు' పత్రికలఁజదివి యానందించు వారిలో నొక్కఁడ నేను. కాని మీరెట్లు వ్రాయుస గాని కులగోత్రనామాదుల మఱుఁగుపఱచియుం-

మాట నాక కాదు పలువురకు రుచింపకున్నది. గ్రంథము విమర్శింపక మున్న గ్రంథకర్త చరిత్రము నెఱుఁగుటకై పాఠకలోకము కుతూహలపడుట యస్వాభావికముగాదు. కాక, యీ యజ్ఞాత వాసమునకుఁ గారణముఁ గూడ మాకు దురూ-హ్యము. ఈలోపము తొలఁగించితిరేని మీలేఖలు మిగుల ప్రశస్తిగాంచఁ గలవని,

విన్నవించు విధేయుఁడు,

అగస్త్య భ్రాత.”

నిజమే! ఈకాలమున గ్రంథముచేతఁ జిక్కినంత గ్రంథకర్తయెవఁడో యేసీమవాఁడో, బాలుఁడో, వృద్ధుఁడో, రూపసియో కురూపియో, వైదికుఁడో, నియోగియో, ఛాందసుఁడో, పట్టపరీక్షా సిద్ధుఁడో, మున్నగు విషయములఁ గమనించుటే చదువరుల మొదటిపని. తరువాత గ్రంథకర్త లబ్ధప్రతిష్ఠుఁడుగానిచో గొప్పవారిచేతి పీఠికయైన యొక యోగ్యతాపత్రికయైన కంటఁబడనినాఁడు గ్రంథమెట్టిదైనను నిస్సారమే.

గ్రంథకర్తృత్వకీర్తి నాశించియున్నచో నేనును తగురీతి నాశక్తిని భూతదర్పణమునఁ బ్రతిఫలింపఁ జేసి భేరీభాంకారములతో సాటించి, చాలమికి జమీందారుని కంకితమిచ్చియో, మహామహో

పాధ్యాయుల పీఠికను సంపాదించియో, రాయ బహాదూరులచేతి యోగ్యతాపత్రికలను ముఖమున కతికించుకొనియో బయటఁగాన వచ్చుచుంటిని. మఱుఁగున నుండియే నాయనుభవములను, నా భావములను, నానిశ్చయములను హితార్థమై లోక మున కెఱిఁగించుటే నాసంకల్పము గాకున్నఁ దొల్తనే నావ్రాతలు నవరసభరితములని, జాతీ-యాభ్యుదయ సంధాయకములని, అజ్ఞానతిమిర సూర్యోదయములని డబ్బిచ్చియైనఁ బత్రికలలోఁ బ్రకటించుకొనుచుంటిని. కాని నాయజ్ఞాతవాస మనేకులకు రుచింప లేదగుటఁజేసి విధిలేక యిప్పుడు వృత్తాంత మొక్కింత వ్రాయవలసెను.

నేనొక్క త్రిదశుఁడను. విద్యాధర వంశ-జుఁడను. నాపూర్వులు హిమాలయ ప్రాంత దేశ విహారముల విడనాడి యిట కరుదేరఁ గారణము లనేకములు సెప్పుదురుగాని వాని వివరములతోఁ జదువరుల నలయింపఁదలఁపలేదు. నాజన్మస్థానము వాఁగులేటి తీరమున, పేరులుకొండ చేరువనున్న గయ్యాళిపల్లియ. గట్టివాయి రాయఁడను విభు ధోత్తముఁడు నాతండ్రి! నాతల్లిని ఊగమ్మ యం-దురు. మాయది గొప్ప పండితకవి వంశమని ప్రతీతి. ఆయూరి యవ్వలు కారణమునిట్లు చెప్పు

దురు. మునుపు సీతం గోల్పోయి యాప్రాంతమునం దిరుగునాఁడొక కపి తన్నుస్తుతింపగా శ్రీరామ చంద్రుఁడు మెచ్చి యచటనివసించు వారందఱును మహావక్తలు కవులు నౌదురుగాత మని వరమిచ్చె నఁట! విజయనగరమున కరుగుచు నొకరాత్రి మా యూర నిద్రింపఁగలిగిన కారణముననే యల్లసాని పెద్దన యాంధ్రకవితాపితామహుఁడయ్యె నందురు. మనపాలిఁటి కివియన్నియుఁ బుక్కిటి పురాణములే, కాని యచట వాగ్మికానివాఁడు లేఁడు; కవికాని వాఁడరుదు. ఆయూరం జనించిన గ్రంథములసంఖ్య యింతయన నాతరముగాదు అచటి విదుషీమణులు రచించిన భారత భాగవత కావ్యములు చేట గంపలలోఁగూడఁ గానవచ్చును. పుస్తకరాశిలో సద్గ్రంథముల నేటి యితరముల నచటి యవ్వలు వంటచెఱకుల కుపయోగింతురు. పోనిండు.

రాజాస్థానములలోఁ బాండిత్యముచే నార్జించిన భూస్థితులును, అగ్రహారవృత్తులును, మావంశమునకుఁ బెక్కులుగలవు. వానివలన వర్షమునకు వచ్చు మూఁడుముక్కాలు వరహాల యాదాయముచే నాజనకుఁడు దానధర్మాదులఁ జేయుచు శిష్యకోటి కొలువ మహామహోపాధ్యాయ బిరుదమున సుఖముండును.

నేను గర్భమున నున్నతఱి మాజనని దుర్ని రీక్ష్య ప్రభాభాసమానయై యద్వితీయవాగాటోప భీకరయై యుండెనఁట. ఆమె కప్పటి చిట్టుములలోఁ బలుకుపండును బదరుకాయయును మాత్రమే రుచి కరములుగా నుండెనందురు. నేజనించిన నాఁటి రాత్రి నాజనకుని స్వప్నమున నొకసిద్ధుఁడు సాక్షాత్కరించి, నాకు వదరుబోతని నామకరణమొనరింప నానతిచ్చెనఁట. పెరిగి పెద్దయైనమీఁద నేఁ గొన్ని యద్భుతకార్యములఁ జేయగలనని యా మహాత్ముఁడనినట్లు మానాయన యప్పుడప్పుడు చె-ప్పుచుండునుగాని, నాకు విశ్వాసమున్నను లేకున్నను వానిఁ బ్రచురింప నాకిష్టములేదు.

పసితనమందు సవయస్కుల గుమిగూర్చి వారి కేదేనియొక యంశము బోధించుచుంటినని మాయమ్మ చెప్పుకొనుచుండును. నాజననీజనకులే నాకు విద్యాభ్యాసముఁ గావించిరి. శాస్త్రకావ్యాదుల జనకునినుండియు ఉపన్యాసపద్ధతిని జనని నుండియు గ్రహించితిని. మోమోటములేక పరుల తప్పొప్పుల వారిసముఖముననే వెల్లడించుటయు, తలకువచ్చినను తథ్యమునే ఘంటాఘోషముగాఁ బల్కుటయును జిన్ననాటినుండి నాయాదర్శములు. ఎంతటికష్టమైన వెనుకంజవేయక తత్త్వమెఱుఁగఁ

దివురుట నా కెక్కువ యభిమతము. ఒకనాఁడు వసుచరిత్ర పాఠముఁ జదువుచు,

"కంజనయ నావిలోచన!

ఖంజనయుగ మెదకు వ్రాలఁగని వసు వాలో
రంజిలుటఁ దెలిసి,.........

యనుపద్యమున, కాటుకపిట్టల జంట వ్రాలినచోట ధనముండునని భూగర్భశాస్త్ర రహస్య మిమిడ్చియుంటఁజూచి యందలి తత్త్వమరయఁ గోరి యప్పటికి పుస్తకముమూసి యరణ్యముల నంటి, కాటుకపిట్టల దాంపత్యమును వెదకుచు, మూఁడుమాసములు తిరిగితిని. తుదకొకనాఁడు నా కోరిక సఫలముకాఁగా నాచుట్టుప్రక్కల భూభాగము-రమారమి, నాలు గెకరముల పట్టు-త్రవ్వించు నంతలో తళతళలాడుచు నొకరూక లభించినది. మహదానందమున "రామభూషణకవీ ధన్యుండవీవన్నిఁటక-" అనుకొనుచు నూరుసేరి యొకగొప్ప వ్యాసము వ్రాసి ప్రకటించితిని. నాటినుండి యనేక స్థలముల ననేకోపన్యాసము లీవలసివచ్చెను. నా వ్యాసము లన్నియు, 'అముద్రిత గ్రంథపయోనిధి' లోఁ జూడఁదగు.

యుక్తవయస్సున నాకుఁ బరిణయ మొనరింపనెంచి నాజనకుఁడెంతో ప్రయత్నించెఁగాని

కులరూప వయోవిద్యలచే నొప్పియున్నంగూడ నా నోటికి వెఱచి యెవ్వరును కన్య నిచ్చిపుణ్యము గట్టుకొనరైరి. ఈముష్టియేమని, సత్యరాజాచార్యుఁడు పోయిన మార్గమున స్త్రీ మళయాళమున కరిగితిని. అచటి నాపనులన్నియునుఁ జెప్పుచుండ నాకిది యదనుగాదు. కాని కొన్నినాళ్ళలోనే నే నచట ప్రఖ్యాతిగాంచితిని. ఒకతూరి స్వయంవర విధిని గురించియు వివాహావశ్యకతఁ గూర్చియు నొక్కబిగిగా మూఁడుదినము లుపన్యసించు నంతలో నచట కన్యలును, ప్రౌఢలును, అవ్వలును సభఁజేసి యందఱు నొక్కమారుగా నన్నే పరిణయమాడ నిశ్చయించుకొనిరఁట! ఈమహిషీ సహస్రము నేలనోడి యారాత్రియే తప్పించుకొని బ్రదికితినో భగవంతుఁడా యని యీదేశమునకు వచ్చి యిఁక నెన్నఁడును వివాహము మాట యెత్తనని నిర్ధరించుకొంటిని.

కాని, రామేశ్వరమునకుఁ బోయినను శనైశ్చరుఁడు వదలలేదన్నట్లు, ఆకామినులలో గొందఱు నాయడుగుల జాడనంటి యీదేశమున కరుదెంచి నన్ను వేటాడుచున్నారు. వారి బారికిఁ జిక్కకుండుటకై నాఁటినుండి నే నీయజ్ఞాత వాసమున నుండవలసివచ్చినది. నా యుపన్యాసము లన్నియు

మూలఁబడినవి. నావాగ్ధోరణి చల్లారినది. కాని స్వభావము వదలలేక యీలేఖల రూపముగ నించుక వదరుచు నాయాత్మ తృప్తిఁగాంచు కొనుచున్నాఁడను.

నేటికింత చాలును. మదీయములగు నితర విషయములఁగూర్చి మఱియొక తూరి విన్నవించు కొనియెద.

---

## సుఖాపేక్ష.

౧౦

సుఖాపేక్ష మానవులకుఁ గడవరానిది. అనుదినమును విసుఁగు విరామములు లేక మన యాచరించు పనులును, పడు ప్రయాసములును, అనుభవించు కష్టములును, సుఖాపేక్షం బట్టియే!

ఆత్మరక్షణాసక్తియే జంతు జాలమునకుఁ బ్రకృతి సిద్ధమైన ప్రథమోద్దేశమని కొందఱూ-హింతురు. కాని, యది యంతగా నన్ని వేళల యందును నిజముగా నేరదు. సౌఖ్యనాశము ప్రాణములపై కూడ నిరపేక్ష జనింపఁజేయుచుండుట మనము గాంచుచున్నారము. దయితా వియోగమునఁ బ్రాణములకుఁ దెగించు పురుషులును,

ప్రియవిరహమున నసువులువాయు రమణులును మనకుఁ గ్రొత్తలుకారు. సామాన్యదృష్టికి జీవితోద్దేశములుగఁ గానవచ్చు దేహబుద్ధి బలములును, జ్ఞాన వైరాగ్య సంపదలును, విద్యావివేకధనములును, మున్నగువానిపై మానవులకుఁగల యాశను విమర్శించి చూచినచో నన్నిఁటికిని నిదానము సుఖాసక్తిగ స్పష్టముగ గోచరించును. అంగనా వ్యాసంగపరుఁడు మొదలుగ నంత రాత్మ వ్యాసంగపరుని దాఁక సర్వులును సుఖము-సుఖ మనియే భ్రమించుచుండుట! కాని సుఖమెందున్నది?

ప్రత్యుత్తరమునకుఁ దత్త్వజ్ఞులు ముందు వెనుక చూడరు. జీవితోద్దేశ మిట్టిదని మతాచార విధుల ననుసరించియో, ప్రకృతిశాస్త్ర రహస్యముల మూలమున నూహలనల్లియో యుపన్యసింపవత్తురు. ఆకాశమున మేడల నిర్మించుకొని గాలి యుయ్యేలలలో నూగుచు మనసున మండిగలు చేసుకొని రుచియనుభవింతురు.

అవాఙ్మానసగోచర మగు వస్తువు నెఱుఁగుటకై వినువానికన్న నుపదేశించువాని కెంత యహ్నాతయున్నదో నాకింకను బోధపడినదికాదు. పోనిండు. మన మిప్పుడు నేరువవలసిన విద్య బ్రతుకు. బ్రతుకున సుఖులమైతిమేని ధన్యులమే! కాని

సుఖమెట్టిది?

ఈప్రశ్న కుత్తరము సులభముగాదు. ప్రపంచమున సుఖమిట్టిదేయనికాని యది తనసొమ్మే యనికాని నోరువిడిచి చెప్పసాహసించు ధైర్యశాలి మన కంటఁబడఁడు. అయినను జన్మమెత్తిన మీఁద నొకప్పుడైన సుఖమును చవి చూచితినని యను కొనని యభాగ్యుఁడు లేఁడని మాత్రము చెప్ప వచ్చును. కాని యొక్కొకనికది యొకరూపమునఁ దోఁచుచుండును.

॥దధి మధురం మధు మధురం
దాక్షా మధురా సుధాపి మధురైవ।
తస్యతదేవహి మధురం
యస్య మనో యత్ర సంలగ్నం॥

అనురీతి నెవని మనసు దేనిపైనుండునో, తత్ప్రాప్తియే సుఖమూర్తియని వాఁడు తలపోయు ను. ఇంతియకాదు; నేఁటి సౌఖ్యము రేపటికట్లు తోపదు. కాక, కోటీశ్వరులును రాజాధిరాజులును గూడ ననేకసమయముల నిఱుపేదలకన్న నెక్కుడు సుఖదూరులుగ నుండుటకలదు. మఱి ప్రపంచమున వాస్తవముగ నట్టిపదార్థమే లేదా?

నిన్న సాయంతనమునఁ దటాకపు టొడ్డునఁ గూర్చుండి యీవిషయమై తలపోసి కొనుచుంటిని.

ఒక యవ్వ నీళ్ళకై వచ్చియుండి నాశూన్య దృష్టు లను బరధ్యానమును గమనించి కారణమడిగెను. మునుపు హరికథకుఁ బోయిననాఁడు కూనలమ్మ కీర్తనపాడిన యవ్వగా గుర్తించి నాయాలోచనల నామె కెఱిఁగించితిని. ఆమెయు నవ్వి వినుమని నాకీకథఁ జెప్పెను.

పూర్వ మొకప్పుడు నలుగురు యువకులు చేరి ప్రపంచమున నత్యుత్కృష్టమగు సుఖమును బడయఁగోరి చాలకాలము పంచాగ్ని మధ్యమునఁ దపమాచరించి రఁట! దైవము వారికిఁ బ్రత్యక్షమై కోరికె యడుగఁగా నందఱు నేకవాక్యమున "మహా ప్రభూ! సర్వోత్తమమగు సుఖమును బ్రసాదిం- పుము." అని ప్రార్థించిరి, "సరే! కాని చెఱి యొకవిధమగు సుఖ మివ్వవలనుపడదు. నేను మరల మూఁడుదినములకు వచ్చెదను. ఆలో మీరు నలుగురును మంతనముండి మీయందఱకును రు- చించు సర్వోత్తమమగునట్టి సుఖమేదో నిర్ధరించు కొని నాకుంజెప్పినచో నిచ్చెద"నని భగవంతుఁ డానతిచ్చి తిరోహితుఁడయ్యె.

నాఁడంతయు తనంతనాలోచించి విషయము నిర్ధరించుకొని మఱునాఁ డొక్కొకఁడు తన సిద్ధాం తమును వ్యక్తము సేయునట్లుగవారు తీర్మానించు

కొనిరి. తోడనే చెఱిరియొక వివిక్తస్థలమునఁ గూర్చుండి నాఁడు రేయెల్ల కనుఱెప్పవేయక యనేక ప్రకారములఁ దమ మేధాశక్తిని తలక్రిందులు సాముచేయించుచు వారందఱు నాలోచించుకొనుచుండిరి.

మఱునాఁ డుదయమున నొకచోట వారెల్లరు సమావేశమైనపుడు ప్రథముఁడైశ్వర్యము కోరుదమనియె. ద్వితీయుఁడు శాశ్వత దేహారోగ్యమునుగోరెను. "సంపదలు క్షణ భంగురములు దేహము బుద్బుద ప్రాయము. సుఖమున్న నిరంతరమును గామినీజనపరివృతుఁడై దర్పకుని తక్కళ్ళాలాడించుటే సుఖ"మని తృతీయుఁడు వాదించె. నాలవయతఁడు "విద్యాధనమే సుఖ" మనియెను. నలుగురును వాదులాడఁజొచ్చిరి; తర్కింపసాగిరి. పూర్వపక్షములు లెక్కకు మీఱి బయలుదేరెను. వానిలోఁ గొన్ని తునుక తునకలుగ ఖండింపఁబడియె. కాని సిద్ధాంతము స్థిరపడలేదు. రెండు దినములు గడచె.

మూఁడవ నాఁడు కూడ సాయంకాలము దాఁక వాదముజరుగుచునే యుండెను. "ఆరోగ్యమే సుఖ; మెన్నియున్ననేమి?" యని యొకఁడు స్థాపింపఁగా నితరుఁడు, తినకూడును, కట్టుబట్టయు లేక

గూబ బ్రతికినట్లు బ్రతికిన నేమిసుఖమని యెత్తి పొడిచెను.

"విద్యానామ నరస్య రూప మధికం
ప్రచ్ఛన్న గుప్తం ధనం"
అని యొకఁడు సాధింపఁగా, కాదని,
"అసారే ఖలు సంసారే
సార స్సారంగ లోచనా!"
యని యింకొకఁ డుదహరించెను. ఇట్టి మూర్ఖులం గూర్చియే.

"శా॥ చన్నుల్ కాక పసిండి కుండ లఁట! వక్షశ్చర్మ దుర్మాంసముల్,
కన్నుల్ క్రొవ్విరి దమ్మిరేకులఁట! వేల్లిద్దూషికా గోళముల్,
వెన్నల్ సోగ యనంటి యాకులఁట! సంవీతార్థి పుంజంబులే,
యన్నుల్ సౌఖ్యముగాఁ దలంచు జను లాహా యెంత మూఢాత్ములో"

యని వ్రాసిరని ద్వితీయుఁడు నవ్వెను. వాని మిత్రున కిది యరకాలఁ బెట్టిన కొరవి నెత్తికెక్కినట్లయ్యె. అతఁడు రోషావేశమునఁ దటాలున లేచి "ఛీ! అబలాజాతి నింత యగౌరవమాడిన చండాలుఁడు భూమిలోనుండ నసర్హుఁ"డని చేతి

కబ్బని నూఁగు మీసములఁ ద్రిప్పుచు యుద్ధసన్న
ద్ధుఁడు కాఁగా, నతని ప్రతిపక్షుఁడు "జాగ్రత!"
యనుచు నశనింబోలు ముష్టింజూపెను. కొంత
తడవు ప్రహారములతో నన్యోన్య దేహములపై
వారు పూర్వపక్ష సిద్ధాంతములఁ జేసికొనుచుండిరి.

అంతలో నకాలమున నాకసమున మెఱుపు
మెఱసినట్లయినది. ప్రథముఁడు పైకిఁజూచి "అదో
భగవంతుఁడు!" అనియె. వాదములకింక నవకాశము
లేదు. ఈశ్వరుని యెదుట నిపు డేమని విన్నవింప
వలయునను విషయమై వారు చాలఁ జింతాక్రాంతు
లైరి. అపుడించుక వివేకశాలియగు నాలవవాఁడు
"ఈవాదములతో మన కేమియు స్థిరపడినదికాదు.
మనలో నొకఁడు కోరినది యితరులకు రుచింపదు.
కాన నందఱకు రుచించునట్లుగ నే నొకటి చెప్పె
దను" అని యొకమార్గముబోధించెను. అందఱును
సమ్మతించిరి.

ఆకసమునుండి విమానము క్రిందికవతరించెను.
"ఏమి నిర్ధరించితిరి? మీ కేసుఖము కావలెను?"
అను నక్షరములు భగవంతుని నోటి నుండి వెడ
లియు వెడలక మున్న నలుగురు నేక వాక్యముగ
"స్వామీ! మా కేసుఖమునువలదు. మేముకోరు
వరమింతే" అనిరి. భగవంతుఁడును నవ్వి "మీ

కిప్పుడు సుఖస్వరూపము బాగుగఁ దెలిసినది. ఇఁక మీకు నేనియ్యఁదగిన దేమియు నుండదు. పొండు!'' అని యానతిచ్చి యంతర్ధాన మందెనఁట!

---

# సత్యసంధత.

## ౧౧

తిమింగిలాది ఘోరజలజంతుసంతాన సంకులమై, మైనాక ప్రముఖ శిఖరి కులదుర్గమమై ఝంఝామారుతోద్ధూత కల్లోల మాలికాకులమై సలిల ప్రవాహ దురవగాహమైన మహార్ణవమునఁ దెప్పతోఁ బ్రవట్టిన కర్ణధారకుఁడు తన్నేకాక తోడివారింగూడఁ జెఱచును. తెలిసినదైన, పొరఁబాటునదైన, అజాగరూకతనైన నొక్కమారు, మారు త్రోవఁబడినచో నే తిమింగిలము బారిపడిడో ఏ గిరిసానువుల ఢీకొనియో, ఏసుడిగుంతలఁ జిక్కియో, నావ యపాయముపాలు గాక గట్టు చేరుటరిది. ఈప్రపంచము మహాసముద్రము వంటిది. భయానకరోగజాలములు, వికారవసన గహ్వరములఁ దెఱచి కబళింప సిద్ధముగనుండును. వ్యసనపరంపరలెంతటి స్థిరచిత్తము నేని వ్రయ్యలు చేయఁజాలియుండును. విషయవ్యామోహ వీచికలు తల

దిమ్మపట్టింప దివురుచుండును. ఆశా ప్రవాహ
ములు పెడదారిం బెట్టి సుడివడఁజేయుచుండును.
విశేషమిందేమన, కనుచూపునఁ దోచునవన్ని-
యు హృదయంగమములై నేత్రానంద దాయక
ములగు రాజమార్గములే! వానిలోఁ దగినవాని
నేర్పరించుకొను జాణతనము మానవున కత్యా
వశ్యకము.

కాని సన్మార్గము ననుసరించుట మనుజునకు
శక్యమా? ఇది సరియైన మార్గమని యతఁడెట్లు
కనుగొనగలఁడు? అగాధ సంసారాంబుధిఁబడి కొట్టు
కొనుచు నానావిధములగు యాతనలచే బాధపడు
నాతనికి దరిజేరనగు మార్గ మెవరుబోధింతురు?

మహార్ణవమున నెన్నియో యోడలు ప్రతి
దినమును రేయియనక పగలనక ప్రయాణము
సేయుచునేయున్నవి. అవి తమ గమ్యస్థానమునకు
నియమితకాలమునందు తప్పకచేరుచున్నవి. మా-
లిమి యేతొందరలేక యెప్పుడునుశాంతచిత్తుఁడై యే
యుండును. దానికి దిగ్భ్రమ యెన్నఁడునుగలుగదు.
వాఁడేదిక్కునకుఁ బోవలసియుండినను దారిని
చూపున దొక్కటే! అదేది? ధ్రువనక్షత్రము.
అదిస్థిరము. ప్రపంచమున నేది మార్పుచెందినను
ధ్రువనక్షత్రము తనచోటు మానదు. ఎట్టి చిక్కు

లలో నున్నవారికిని నదేదిక్కు. దానినమ్మినవాఁ డిదివఱకును పెడత్రోవఁ దొక్కలేదు.

సంసారసాగరమునఁగూడ సరియైన మార్గము మును జూపుట కిట్టినక్షత్రమేగలదు. సకలజంతు సంక్షోభకరమై భూమ్యాకాశములనెల్ల జలమయము జేయు గొప్పతుపానుచే ధ్రువనక్షత్ర మగుపడక పోవుట తటస్థించిన సమయమందుగూడ నది స్పష్టముగాఁ గానవచ్చుచునే యుండును. ఏమూల నుంచినను ధ్రువమునే చూపు సూదంటురాతిముల్లువలె మనయంతరాత్మ సర్వావస్థలయందును ఆ నక్షత్రము వైపే జూపుచుండును. ఆనక్షత్రమేది? దానిపేరు సత్యసంధత. ఇదివఱ కెందఱో దాని నమ్మి కష్టముల దరిఁజేరియున్నారు. నలహరిశ్చంద్రు లద్దాని సాహాయ్యము లేక యుండినచో, నే దుష్టమార్గమునఁ బడిపోవుచుండిరో యూహింపలేము.

అరబ్బీకథలలో నొక వృత్తాంతముగలదు. సిందుబాదనువాఁడు పోవుచుండిన నావ దారితప్పి అయస్కాంతపురాలచేనిండిన గుట్టయొద్ద పోవలసి వచ్చెను. నావ యింకను కొంతదూరముండగనే దానిలోని యినుప మొలుకులన్నియు దానిచే నాకర్షింపఁబడినందున నావగూడ పర్వతమునకు దగు

లోనికి మరలి రాలేక తుపానులచే దరికి కొట్టఁబడి పగిలిపోయెను.

మన దేహయాత్ర నౌకాయాత్ర వంటిది. విషయవ్యామోహమను నయస్కాంత పర్వత శక్తిచే చిత్తవృత్తు లాకర్షింపబడినప్పుడు, మనుజుఁ డట్టిట్టు కదలలేక సన్మార్గమునకు దూరమై దుఃఖమునకు జిక్కి నశించును. కనుక విషయము లకుఁ జిక్కక సన్మార్గమునఁ బ్రవర్తించిననే తప్ప మనుష్యుఁడు జీవిత పరమావధిని జేరలేడు. వేగమంత యసద్దైనను నావమార్గమునందున్నచోఁ గొంతకాలమునకేని తన రేవు చేరఁగలుగును. కాని యించుక మార్గమును విడచిన నావకెంత వేగము న్నను, ఆవేగము దాని రేవునుండి దూరము సేయుట కే యుపయోగించును. అట్లే మనుష్యుని శక్తి కొంచమైనను సన్మార్గమందున్నచో కొంతకాల మునకేని యది యతని పరమావధి సేర్చగలు గును. సన్మార్గమునుండి తప్పిన వానిశక్తి యెంత యున్నను నది యతని యవధినుండి క్రమక్రమ ముగా దూరస్థుని జేయును.

కులము, రూపము, ప్రాయము, పరువము, ఐశ్వర్యమునుగలిగి సర్వవిధముల నొప్పిన సుయోధ నుఁడు కొంచెము విషయప్రవిష్టుఁ డగుటచే, నాతని

శక్తియు నభిమానము నాతనిఁ జెడత్రోవకీడ్చి తుదకెట్టిస్థితికిఁ దెచ్చినదో చదువరు లెఱిఁగియే యున్నారు. మఱి ఇఁక సుధాముని జూడుఁడు! అతఁడు కట్టుబట్టలేక, కుచేలుఁడని పేరొందెను. తన యిరువది యేడ్వురమంది కొడుకులు నాకలిచేఁ బట్టి పీడించుచున్నప్పుడు గూడ, తన జీవితముపైఁ గాని, సృష్టించిన భగవంతునిపైఁగాని విసిగికొనలేదు. ధనార్జనమునకై న్యాయమునకు దూరమైన యేపన్నుగడను తలంపలేదు. అట్లే చిరకాలము కష్టములనొందెను. తుదకైహికాముష్మిక సుఖముల నొందగలిగెను.

అన్ని నీతిశాస్త్రములయు, అన్ని ధర్మశాస్త్రములయు, అన్ని మతగ్రంథములయు, సారమిా సత్యసంధతయే. అది లేక యుండెనా మానవుఁడెంత పండితుఁడైనను, ఎంతయాచారవంతుఁడైనను ఏవగింపదగినవాఁడే. 'సత్యము సర్వశ్రేయోమూల'మని పెద్దలే నుడివియున్నారు.

ఏమతాభ్యాసమునకైన నాచార్యుఁడవసరమేమోకాని దీనికి నాచార్యుఁడే యనవసరము. అన్నివేళల మంచి నుపదేశించెడి మనయంతరాత్మయే యాచార్యుఁడు. కనుక హృదయంగమములైనను చెడద్రోవలఁ బడనీక సన్మార్గముల నేర్చ

అరచి చూపఁగల శక్తి యొక్క సత్యమునందే యున్నది. మనజీవయాత్ర కడతేర్పవలయునన్న సన్మార్గమునసే పోవలయు. దానిఁ గనుగొనుటకు సత్యమునకన్న వేరు దీపమేలేదు. కనుకనే,

"There is no Religion higher than Truth"

అనునా నుడి.

## అద్భుతకవిత్వము

౧౨

భోజరాజు ముఖముఁ జూచి సంత నెత్తి మూర్ఖునకైన నవరస భరితమగు కవనము చెప్పు శక్తి తనంత వచ్చుచుండెడిదఁట! విద్యాగంధ మెఱుఁగనివారుగూడఁ గవులగుచుండిరఁట! అక్ష రజ్ఞాన శూన్యులగు గొల్లపడుచులును, ఎఱుక జవ్వ నులు నయితము పద్యము లాశుధారగ నల్లఁగలుగు చుండిరఁట! ఒకనాఁ డామహానుభావుఁడు వేట నుండి మట్ట మధ్యాహ్నమున నొంటినై మఱలి వచ్చుచు నాతపక్లేశ భిన్నుఁడై చాలడప్పిఁగొని యుండఁగా నాతోవలో నొక గొల్లపడఁతుక చల్ల కుండ నెత్తి నెత్తికొని పోవుచుండెను. అతఁడది

గని యాముద్దియ నడిగి చల్లఫుచ్చుకొని తాగివి తృప్తుఁడై యభిమత మడుగు మనఁగా నాజవ్వని తన చిత్త మాతనిపై హత్తెనను నర్థమిచ్చు నీ హృద్యమగు పద్యముం బఠించెనఁట!

"ఇందుం కైరవిణీవ కోకపటలీ
వాంభోజినీవల్లభం
మేఘం చాతకమండలీవ మధుప
శ్రేణీవ పుష్పంధయం
మాకందం పికసుందరీవ తరుణీ
వాత్మేశ్వరం పోషితం
చేతోవృత్తి రియం మమాట నృపతే
త్వాం దుష్టు ముత్కంఠతే''

ఇది నిజమైనచో నామహనీయుని పరిభావ మెట్టిదో యిప్పటి మన యలఁతియూహల కగోచరము.

కవిత్వ మంత సులభముగ లభింపఁగల పదార్థమైనపు డంతకన్న మనము గాంక్షించు కామితమేలేదు. కవనము కళ—అందును జితరి కళ. కళలన్నియు నభ్యాసమూలములు. స్వభావ వశమునఁ గాక బలాత్కారముగ నార్జించిన కవన శక్తి ప్రేమచేఁ గాక నిర్బంధమున మెడకంటఁ గట్టుకొన్నతరుణింబోలె రసాభాస ప్రసక్తి కాకర

మగుననుమాటలోనెంత సత్యమున్నను, పాండిత్యమునకు దూరమై ప్రపంచానుభవనమునకుం బాసి భావనా శిల్పముల నెఱుంగక వ్రాయఁబడు కవితకును గవితయనుపేరు చెల్లునేని, యిఁక ప్రపంచమున నూటికి నూరువంతులు కాళిదాసులే యగుదురుగదా? అప్డుడాడిన మాటలన్నియు నాశుధారలై పాడినపాటలెల్ల ప్రబంధములగును. అప్పుడు "నీవు బ్రహ్మాండ భాండములను సృజించినచో నేను మంటి భాండముల సృజింతును. నాకన్న నీ దేమిఘనత?" యని కుమ్మరియును సృష్టికర్తనధిక్షేపింప వచ్చును.

పోనిండు. భోజరాజు కాలమునాటి గొల్లపిల్లలజోలి మన కేల కాని, కవులును, కావ్యములును బ్రపంచమునం దంత యగ్గువగ లభించుట యసంభవము. అద్వితీయ మేధావిశేష భూషితులై యధీత సకల శాస్త్రార్థసారులై యధిగతలోకానుభవవివేకులైన మహాకవులు సయితము తమజీవిత కాలమంతయు నొకటి రెండు గ్రంథములు రచించుటయందే గడపిరి. కవనమున కత్యుత్కర్షము లభించు కాలములోనుండియు కవికుల శ్రేష్ఠుఁడగు భట్టబాణుఁడు తన వ్రాయఁగడంగిన కాదంబరిలో నొకభాగము మాత్రమే తన యాయుఃపరిమితిలోఁ

బూర్తిసేయ నోచుకొనియె. అష్టదిగ్గజములలో నెల్ల మేటియై యాశుధారా ప్రవీణుఁడగు నల్లసానివాఁడును నిండుసభలో నొకనాఁడు తన్ననవరతము పోషించు కృష్ణరాయనివంటి మహాప్రభువు తన కొక్క-కృతి యిమ్మని వేడఁగా భాగ్యముపండెనని కానిమ్మనక,

"నిరుపహతిస్థలంబు రమణీ ప్రియ
దూతిక తెచ్చి యిచ్చుక
ప్పురవిడె మాత్మకింపయిన
భోజన ముయ్యాల మంచ మొప్పు త
ప్పరయు రసజ్ఞులూహ దెలియం
గల లేఖక పాఠకోత్తముల్
దొరికినఁగాక యూరక కృ
తుల్ రచియింపు మటన్న శక్యమే"

యని కేవలప్రత్యుత్తర మొసంగెను కాని, పట్టుమని పదిపద్యములయిన నారాజుపై చెప్పిన పాపమునం బోలేదు.

కాని మనకాలమున నిట్లుకాదు. భోజరాజు దర్శన మక్కఱలేకయే సర్వులును గవులగుచున్నారు. అక్షరలక్షలు లభింపకయే గ్రంథములసంఖ్యాకములుగ బయలుదేఱుచున్నవి. "చదువురాని వానికి సర్వే" యనురీతి నితర విధ జీవ

నోపాయముల నెఱుంగినివారు కవిత్వమును శరణ మాశ్రయించు చున్నారు. పెద్దనకాలము నాంటి కన్న నిపుడీ విద్య యతిసులభము. నాఁడువలసిన సప్త సాధన సామగ్రి యిపు డక్కరలేదు. నేఁడు కవనమునకు వలసిన వెల్ల మూఁడే సాధనములు! ప్రవాహలేఖిని (ఫవుంటన్ పెనా) యొకటి; అక్షర సాహ చుట్టలపెట్టియ (లేక పాజపాక్ పొడుము కలకాయ) రెండు; తేనేటిచేనిండిన పాత్ర (లేక రెండు మూఁడు తులముల నల్లమందు) మూఁడు. గద్యకావ్యమున కింతచాలును. పద్య ప్రబంధము లకు సులక్షణ సారములోని యయిదారు పద్య ములు వచ్చుటకూడ మంచిదే! ఈమాత్రపు సాధన సహాయమున లెక్కకుమీఱిన గ్రంథములు బయలుదేరుచున్నవి. కావననే నేటికాలమున నిట్టి గ్రంథవర్షము! పిచ్చిబొఱుఁపొక్క నవలలో నొకభాగము మాత్రమే వ్రాయఁగలిగెను కాని యిప్పటికావ్యములఁ జూడుఁడు! పూర్ణిమనాఁడారం- భమయి యమావాస్యనాఁడు కడముట్టునవి కొన్ని, మఱికొన్ని యేకాదశి యుపవాసమున నుదయ మంది ద్వాదశి పారణతో ముక్తిపడయునవి!

మఱియొక విశేషము! కృష్ణదేవరాయఁ డాంధ్ర భోజుఁడను ఖ్యాతి గడించెనేకాని తుదనొక

డియో రెండో కావ్యములకే కృతిపతి కాఁగలిగెను. ఆకాలమునఁ గృతుల నంకితమిచ్చువారి సంఖ్య చాలస్వల్పము. ఇపుడో, అంబరాగ్రహారాది పరిదానములచే నర్థింపకున్న మానెఁగాని యడుగకయ మున్న గ్రంథముల రాసులుగఁ దెచ్చి యంకితమిచ్చు దాతలు వేన వేలుగలరు. క్రోసుదూరమున నుండియే కవులకొక వేయినమస్కారములు చేయుచుంటం బట్టియే కాకున్న నీవఱకు రత్నములతోడఁ గూడఁ గావ్యకన్యకల నిచ్చి యొందఱు వరసకు నాకు మామగారగుచుండిరో నేనిపుడూహింపఁ జాలను.

కాని యొకటిమాత్రము మఱువరాదు. కావ్యము సప్తసంతానములలో నొకటిగఁ బరిగణింపఁబడఁదగినది. శబ్దేందుశేఖరము మంజూష యను గ్రంథములు రచించిన పండితోత్తముఁడు నాగోజీదీక్షితుని నొకరు సంతానమునుగుఱించి ప్రశ్నింపఁగా నతఁడు,

"శబ్దేందుశేఖరః పుత్రో
మంజూషా మమ పుత్రికా."

అని సమాధానమిచ్చెనఁట! పాండిత్యమునకుఁ దోడు ప్రపంచానుభవముగల్గి పెద్దనామాత్యుఁడన్నట్లు సప్తసాధనయుతుఁ డయినకవి

వ్రాసిన కావ్యము సప్తవిధ సంతానములలో నుత్తమసంతానమనుట కేమిలోపము? ఇక యిప్పటి సాధనత్రయమున వెలువడు గ్రంథములు—అందునను పోలు పొందు లేని నవలలు—నూటిం బోంబది వంతులు గ్రంథకర్తల దేహములపై మొలచిన దుర్మాంస గ్రంథులన్నను నాకు బాపము రాదని నాయాశయము.

"విద్వాంస్త్వత్ర కవయః
కేవల కవయస్తు కేవలం కపయః"

---

## నాటక తత్వము.

### ౧౩

కావ్యములలో నెల్ల నాటకములు శ్రేష్ఠములని పెద్దలుపలుకుదురు. లోకమునందలి జనుల వ్యవహార వ్యాపారాదులను వానియందలి గుణదోషములను, తత్తత్ఫలములను, అన్నియు నున్నవి యున్నటుల ప్రేక్షకుల కనుల ముందఱ నుంచి కనులారంజూచి యనుభవమునకుం దెచ్చికొండని బోధించునవి నాటకములే యగును. కావ్యశాస్త్రాదులు పండిత హృదయములకు మాత్రము గోచరములగుటం జేసి నాటకములు పామరులకుం గూడ

బుద్ధి గలప్పుడు నాహ్లాదకరము లగుటంబట్టియే వాని కీశ్రేష్ఠత్వమనుట నిర్వివాదాంశము. రామాయణము జరుగునంత కాలమును రాముని వెంట నుండి పరీక్షించుచు నతని జీవితమునుండి నీతిని గ్రహింపవలెనన్న నెందఱకు సాధ్యము? ఎన్నఁడో, ఏ దేశముననో, ఎన్నియేండ్ల కాలముననో నడచిన చరిత్రములలోని యనుపయుక్తాంశముల నెల్ల వదల్చి స్వల్పకాలమున వానిసారమును మాత్రము మనకన్నుల యెదుటఁ బెట్టుశక్తి యీనాటకములకు మాత్రమే గలదు.

కాని, నాటకమని పేరు బెట్టుకొన్నంతనే నెత్తిఁ బెట్టుకొని పూజింపవలెననుట కాదు. సర్వజనోపయుక్తమగు నీతిబోధించు సత్కథా సంవిధానముగల్గి, హృదయంగమరచనా వైదగ్ధ్యముతో నొప్పి, ప్రపంచానుభవ శాలురగు సత్కవులురచించిన నాటకములే నాటకములుకాని యితరములు బూటకములు. సత్కథా ప్రణాళికచే నలరు నాటకములు నీతిబోధచే లోకమున కెంత యుపకరించునో దుష్కథా సరణిఁ గూర్పఁబడ్డ నాటకములు దుర్నీతి కాదర్శ ప్రాయములై ప్రపంచమునకంత యహితముం గూర్చును. వానిలోని నీతి వ్యంగ్యరూపముగ నేమి, ఛాయామాత్రముగ

నేమి, చూపఁబడునట్టిది కాక స్పష్టముగను ప్రసిద్ధముగ గోచరించు చుండవలయు. మూర్తీభవించి చాలకాలము ప్రేక్షకుల నేత్రములకుఁ గట్టినట్లుండ వలయు, జీవితముల కాదర్శము గావలయు. మన చిత్తములలో నాటు కొనఁగలవి ప్రధానపాత్రల గుణచర్యాదులే యగుటచే నవి నీతిదాయకము లగుట చాల యవశ్యకము. ఏవిదూషకుని చర్య యందో ఏపరిచారిక నడతయందో నీతిగలదన్నచోఁ జాలదు. సావిత్రి చిత్రాశ్వమును, అహల్యాసం క్రందనమును ప్రదర్శింపఁబడి నపుడు వానియందలి ముఖ్య పాత్రల గుణ చేష్టాస్వభావాదులు చూపఱ హృదయసీమల జనింపఁజేయు భావములకుఁ గల తారతమ్యము నెఱుగవర్ణింప నక్కఱయుండదు. తారాశశాంకుల జంఝాటముల నెల్ల పూసగ్రుచ్చిన తెఱంగునఁ బ్రదర్శించి, "తగని దాంపత్యమునఁ గల్గు ఫలమిట్టి"దని కొనకొక నీతిముక్కను బడ వేసినచోఁ జాలునన నెవఁడు సాహసించును? కాన, నాటకముల యుపయోగము, వాని కథల ననుస రించి యుండుననుట.

ఆధునిక నాటకకర్తలు పలువు రీ యంశ ముపై దృష్టివదలి స్వేచ్ఛగా కథలఁగైకొని నాట కముల జతికే కళంకమును దెచ్చిరని చెప్పక

తీరదు. తారాచంద్ర విజయము, బిల్హణీయము మున్నగు కథల రూపకములు రూపమున నేర్లు మార్చి మార్చి వ్రాసిరి ఇతర కథలెన్నియో యున్నవేల? యవి వారి రసికతకుఁ జనికిరావు. రసములలో రాజగుటం బట్టి శృంగారము పచ్చిదై నను విడువరానిదయ్యెఁగదా! పోనిండు. పాటలో వసలేనందుకు నాట్యములో నసమైన నుండవలెనని కాంబోలు లేనిపోని సంవిధానములఁ గల్పించి, రసాభాసముగ నాయికా నాయకలతో శృంగార సల్లాపములఁ జేయించుచు గంటలకొలఁది రంగమున వారిని నాట్యమాడించిరి. చాలనందుకు ప్రశ్నోత్తర రూపములగు పాటలఁగూర్చి జేనెఁడుకు జేనెఁడు, మూరెఁడుకు మూరెఁడు, బారెఁడుకు బారెఁడుగ నర్థములేని ప్రశ్న కవసరములేని యుత్తరము లిప్పించుచు రసముతోడ నీతినిగూడ కొంపఁగూల్చుటఁ జూడ నేసజ్జనకయిన మనసు కళుక్కు మనకమానదు.

ఇంతటితోఁ బోయెనను కొనరాదు. ప్రత్యక్షముగ రంగమునఁ బ్రదర్శింపఁ బడదగని విషయముల ప్రసంగము సందర్భ వశమున గల్గినచోఁ బ్రాచీన రూపకకర్తలు సంవిధానమును ముద్దుగ మార్చి తేలిపోవుచుండిరి. ఆధునికుల రసికత

కీమఱుఁగు మాటలు సరిరావు. నాయకుఁడు వేశ్య యింటికరుగు సంవిధానమును గల్పించి యొక కవి యారంగమున వీధి బొజుంగులు సానివాడకుఁ బోవునప్పటి యాచారములును వేశ్యతోడి సంభాషణచాతుర్యాదులును తూచా తప్పకుండ ననుభవహీనుల కుపకరించులాగు వ్రాసి వారి కృతజ్ఞతకుఁ బాత్రుఁడయ్యె. మఱియొక కవిశిఖామణి తారాశశాంక విజయమునఁ బడకటింటిలోఁ దూగుమంచముపైఁ గూర్చున్న చంద్రునకుఁ గుఱులు దువ్వుచు సరోక్తుల దేలుచున్న తారాదేవికిఁ బరవశత్వమునఁ బోక ముడి వీడినట్లు పైశాచ శృంగారవర్ణనగల రంగము నొక దానిని గల్పించె ననుటకే సిగ్గగుచున్నది. ఇట్టి నాటకము లింకనుఁ గొన్ని బయలుదేఱ గలవా వేఱు దున్నయమేల? మన ఆంధ్రనాటక పితామహుని నాటకరత్నములలోనెల్ల నతని విషాదసారంగధరమే సానదీఱినది. అతని రచనాప్రాగల్భ్యమును నాటక కళా కౌశల్యమును సంవిధాన సంపాదన ప్రతిభయు రసపోషణ చాతుర్యమును నందుఁ బూర్ణముగఁ బ్రతిఫలించిన వనుట యతిశయోక్తికాదు. కాని యెంతపక్వమయిన నేల యాకథ పుచ్చినపండు! తొడిమకడనో మఱి యేమూలనో తీసి యింత కలదన్నను గూడ

సది పుచ్చుపండె.కాని మెచ్చుపండుకాదు. అందలి ప్రధాన స్త్రీపాత్ర చిత్రాంగి. దాని దుర్నీతి చేష్టా కలాపమంతయు ఆతళుకుఁ బెళుకులును, ఆ మాయదారి చేతలును, ఆ ఆగతనంపు పరుసము లును, ఆ తళితీపు పల్కుల జాణతనమును, ఆ ప్రోడతనపు జిత్తులును, ఆచిన్నెలును, ఆవన్నెలును —నాటకారంభమునుండి ప్రేక్షకుల కనుల కంటఁ గట్టి, తరువాత నెపుడో చిత్రాంగికి దుర్మరణశిక్ష విధింపఁబడెనని తెరమఱుఁగున వినిపించిన మా-త్రాన నాటక దర్శనాంతమున జనుల భావదర్పణ ములలో బ్రతిబింబితములయి నిలిచియుండు భా-వము లెట్టివో, ప్రపంచ తత్త్వవేత్తలకు విన్నవిం చుట యధిక ప్రసంగమే యగును. కథ వేఱయి యున్నచో నన్నివిధముల నగ్రతాంబూలము నకుఁ దగినదై యీనాటకము మాకవి కింకను నూరుమడుంగుల కీర్తిఁ దెచ్చియుండునని ఘంటా ఘోషముగ చాటఁగలను.

దుర్గుణముల వర్ణింపనిదే సుగుణములకు విన్నియరాదను వాదమును గొంతవఱకు మేము నొప్పుకొందుముగాని మందునకైనను విషము తగి నంతయె. వాడవలెనని విన్నవింపవలసియున్నది. ఇఁక నాటకదర్శనము చేతనే చెడుదారిఁ బట్టు

మనసులుగలవా రున్నచో, నట్టి మెత్తని చిత్త వృత్తిగలవారు యతులవలె గుహలలో దాఁగి యుండఁదగినవారే కాని వెలికిరా నన ర్హులని కొందఱి మతము. ఇట్టివానిచే చలింపని చిత్తవృత్తి గల్గి, సుఖ దుఃఖాదులలో సమభావము వహించి.

"పర్ణాంబు భక్షులై నవసి,
యినుప కచ్చడాల్ గట్టుకొను"

వారి యుపయోగమునకై మాత్రమే నాటకము లాడఁబడునేని యెవరి యాక్షేపము నుండదని మావిన్నపము.

"Every play is a problem which tries to answer one of those moral questions that concern nearly all of us."

—PHILIP LITTON.

# పెండ్లి పిలుపు

## ౧౪

ఇయ్యది వివాహ ముహూర్తముల కాలమగుటచే నెల్లవారు నేదోయొక విధముగ నీ శుభకార్య ప్రసంగములలోఁ దగులుటఁజేసి యితరములగు పనులకుఁ జాల లోటు వాటిల్లినది. వయసు మీఱినున్న తమ పుత్రికా జనమునకు వర గ్రహముల వెదకి ముడివేయుటకై చౌకులలోను యాత్రాస్థలముల యందును, పొగబండి సంధి ప్రదేశముల చెంతను గాచికొని కన్యాజనకులును, వరశుల్కముల బేరములను మధ్యవర్తుల మూలమునఁ బరిష్కరించుకొనుచు నిష్కర్షా పత్రికల వ్రాయించుకొను పనులలో వర జనకులును, శ్రమపడి తిరిగి పొత్తులు కుదిర్చి పౌరోహిత్యముల నార్జించుకొనుటకై పురోహితులును, ఈబాధ లేమియు లేని కతంబునఁ బిలువని పేరంటములకైన ముందు పడి పోయి కడుపాత్రము దీర్చుకొను కార్యములలో నితరులును, అందఱును మిక్కిలి పాటుపడుచున్నవారు. సంపాదకునకుఁ గూడ నీలో నొక చిన్ని కూతురు గల్గుటచే నతఁడును నొక చిన్ని వరుని యన్వేషించు ప్రయత్నములో నున్నాఁడు. నా మిత్రులనేకులు కన్యాదాతలుగనో, వరులుగనో,

మీఁజరాని బంధువులుగనో, వివాహకార్యములలో దిగిరి. ముద్రాయంత్రముల కన్ననో, మీఁదు మీఁదు వచ్చుచున్న వివాహలేఖల నచ్చొత్తుటకే తీఱిక యొఁదవదు. కావుననే నా పనులకుఁ గూడ నీవల కొంత యిబ్బంది కల్గిన దని విన్నవించి చదువరుల క్షమాపణము నర్థింపవలసెను.

ఇట్టి పనులలో నాకు మాత్ర మేమియు సంబంధము లేదనుమాట నిజమేకాని, అను దిన మును నామిత్రుల నుండియు నాచదువరుల నుండి-యు, అపరిచితుల నుండియు తపాలావాఁడు మోయలేని మోతగ నాకుఁ దెచ్చి యిచ్చుచున్న శుభ లేఖల "బస్తా"ల విప్పిచూచుకొనుటకైన నాకుఁ గాలము చాలకున్నది. "బ్యాండు" వాద్యపు రొకటిపాట కర్ణ కఠోరమగుచుండ ననుక్షణమును గుంపులు కట్టి వచ్చి లగ్న పత్రికల నందిచ్చువారల గడబిడలో నాకేమియుం దోచుటలేదు.

ఇపుడు నామిత్రులలో నెల్ల మిగిలియున్న వాఁడు రామానందుఁ డొక్కఁడే! విసుకు చెంది కడకేదేని యొక వివాహమున కరుగవలెనని యు-తఁడును నిర్ధరించెను. అంతలో నాతని చుట్టము లలో నొకరు తమయింట నాలో జరుగనున్న యొక మంగళమునకు మేమిరువురమును దప్పక యరుగ

వలెనని యాహ్వానించిరి. వాద్యాడంబరములేక, ముద్రితములగు రంగుల పత్రికలఁ దేక యూరక చేతులాడించుకొనివచ్చి పిలిచి పోయిన యతని యాహ్వానము నాకు మాత్రి మేమో హృదయంగ మముగ నున్నను, నామిత్రున కింతయేని రుచింప దయ్యె. ఈ పిలుపును గౌరవింపవలెనని నాయభీష్ట ముండెనుగాని నామిత్రుఁడది తన కగౌరవముగ నెంచి సమ్మతించినాఁడు కాఁడు.

వచ్చిన పత్రికలనెల్ల త్రిప్పిచూచి తుదకు నామిత్రుఁ డొకదాని నెత్తెను. బంగరు నీరు పోత యక్షరములు చిత్రములగు నలంకారములును గల్గి యాలేఖ చాల సొంపుగ నుండెను. అందలి వర్ణ నలును హృదయాకర్షకములు. నే వలదంటిని గాని, చాలచర్చించి సాపాటు రాముఁడు—నా మిత్రున కది గౌరకనామము—కడకు చెన్నపురికే నెడలెను.

ఆశుభ లేఖ యిది.

ఈ వైశాఖ శుద్ధ పంచమి నాఁడు
పగలు 9–30 ఘంటల వేళ
తన కూతురు సౌభాగ్యవతి
అన్నపూర్ణాదేవికిని
మ॥రా॥రా॥ రావుసాహేబు
చింతామణి కృష్ణరావుగారికిని
చెన్నపురిలో మైలాపురమున
తన పుష్పక విమాన భవనమున
జరుగనున్న వివాహమహోత్సవ వేళకు
వదరుఁబోతుగారు
సపరివారముగ దయచేయఁ గలరని
దివాన్ బహదూర్
అన్నదానము రామరావు
సవినయముగ
ప్రార్థించుచున్నారు.

ఈలగ్న పత్రికలయాడంబరముచూడ నాకే మో తలనొప్పి. రానురాను లోకమునకు డాంభికత్వము పై దృష్టి హెచ్చుచున్నదనుట కీ తలతోకలేని పత్రికలే సాక్షి! మూఁడు నాల్గు రూప్యముల వ్యయముతో నూర్లకొలఁది శుభలేఖల నచ్చొత్తించి బంధువులయినను గాకున్నను, వచ్చువారైనను రాకున్నను గూడ విచారింపక యెదుటఁబడిన వారికెల్ల ప్రకటన పత్రికలవలె వివాహ లేఖలిచ్చుట యేపరశురామునికి ప్రీతియో దైవమెఱుఁగు. పదిపదునైదు పణములతోఁ బెండ్లి ముగింపఁదలచువారును, స్వగృహమున వివాహము జరిపిన యెడ బంధువులతోడి కాటమని యేకొండపైననో, ఏపల్లెగుడిలోనో, ఏరావిచెట్టుక్రిందనో చప్పుడులేక తలఁబ్రాలు పోసికొని రాఁదలఁచు భాగ్యవంతులును నయితేము పత్రికల నచ్చొత్తించి పంపకున్నఁ దమకు గౌరవములేనట్లు భావించు కాలమువచ్చినది. ఆహ్వానపత్రికలందిన వారిలో నాఁడవంతు వివాహమునకు వచ్చినచో భరింపఁగల మనుకొను నుదారపురుషులు నూటఁబదియవవంతైన నీకాలమునఁ గలరని నమ్ముట అనుభవమునకుఁ జాలవిరోధము. ఎవరు తమ యాహ్వానమును గారవింపరో, ఎవరిరాక తమకిష్టముగ నుం-

డదో ఎవరురాఁగలరని స్వప్నమునందైన దాము నమ్మరో అట్టివారికెల్ల నిష్ప్రయోజనముగ నీప్రకట నలఁ బంపుట కంటె మిన్నకుండుటయే గౌరవమని నాతలంపు. నిరర్థకముగ నీ కఱవుదినములలోఁ గాగితమును పాడుసేయ కుండుటే గాక యిందుకై వ్రయమగు ధనమును వేఱు మంచిపనుల కుపయో గించు కొనఁగల్గుటచే వారికిని వారిదేశమునకును గొంతక్షేమమే!

పోనిండు. అయిదారు దినములలోఁ జెన్న పురినుండి నామిత్రుఁడొక జాబువ్రాసెను. దానిని నచ్చు సారి ప్రకటించెదను.

---

## ఆర్యావర్త సుఖవర్తమానము
౧౫

చెన్నపురినుండి నామిత్రుఁడు వ్రాసిన లేఖయిది:—

"పుష్పక విమానము"
"చెన్నపురి"
"వైశాఖ బ॥ షష్ఠి"

"ఆర్యా! పెద్దలమాట వినక దుర్యోధనుఁడును మిత్రుల యుపదేశము నాదరింపక రావణుఁడును

జెడిరి. పెద్దయు మిత్రుఁడు నగు నీపలుకు పాటిం పక నేనును గొంతకష్టము పాలైతి ననుటలో వింత లేదు.

ఈ దినములలోని లగ్నపత్రికలు వట్టి యాడంబరములే యను సూత్రము సామాన్యజనుల కన్వయించుననియు, ఔదార్యాది గుణములచే బిరుదముల నార్జించిన గొప్పవారియెడ నిది యన్వ యింపరాదనియు, తమతో వాదులాడి తత్త్వమర యుటకై యిటు వచ్చితిని. ఆచార్యునికన్న నను భవమెంతో మేలుకద!

పుష్పకవిమాన మొక గొప్ప సౌధము. 'గణ సెట్' వాద్యాడంబరము విపరీతముగను వెగ టుగను వినవచ్చుచుండెను. ముఖద్వారము నలం కరించుచున్న యరటికంబములును పచ్చతోరణము లును గన్నులపండువు సేయును. వాకిటిపైనను, ప్రక్కలను "స్వాగతము"( "Welcome" ) "దయ చేయుడు," అనునక్షరములు నిలువుకొత్తునఁ గాన వచ్చి చూచువారి కాశగొల్పుచుండెను. విమా నముఁ బ్రవేశించి బహిరావరణముఁజొచ్చి కొంత దూర ముత్కంఠతతో నెదురుచూచుచుఁ బోవు చుంటినిగాని, చీమలుపుట్టవలె జనులు వచ్చుచుఁ బోవుచున్న నేమి నాకెవ్వఁడును స్వాగతమియ్య

లేదు. మనసు కళుక్కుమనఁగా నింకను జూతమని యాప్రాంతమందలి శిలాఫలకముపైఁ గొంతతడవు భీష్మించుకొని విశ్రమించితిని. నేనెవ్వఁడనో యేల యుందుంటినో యేరును విచారించువారు లేరైరి.

జాము ప్రొద్దెక్కియుండెఁ. అల్లంతదూరమునఁ బొదరింట్లలోని కృతకశిలావేదికలపై నాసీనులై తరుణులు కొందఱు కాఫీ పరివాహమున దెప్పఁదేలు చుండిరి. వేఱొకపక్కన యువతులు కొందఱు దారితుపందిళ్ల నడుమ గూర్చుండి యువకులఁజూచి ముసిముసినవ్వులు నవ్వుచు నిర్లజ్జనల మాయము చేయుచుండిరి. నోటఁ జుట్టలనిడుకొని కూనూరు పొగబండ్లవలె గుప్పు గుప్పున పొగ వెడలవిడుచుచు చేతబెత్తము లాడుచుండ పడుచువారు కొంద ఱిటునటు పచారుసేయుచుండిరి. మూరెఁడు మూరెఁడంచు దుకూలములనుగట్టుకొని రవలసొమ్ములతో తళతళలాడుచు వర్షాకాలపు సాయంసమయముల లోని సీతాకోక చిలుకలం బోలె చిఱుతప్రాయపు మిటారికత్తెలు గొందఱు కాసు పనిపాటలు లేక యిటునటు విహరించుచుండిరి. ప్రయాణవశమున రాత్రి యుపవసించి యాఁకలిచే బాధపడుచు నే క్షణమున నెవ్వరైన విచారింతురేమోయనివచ్చుఁ బోవువారి ముఖములఁ దిలకించుచుఁ గూర్చుండి

యున్న యతిథియునికినైన గమనింపని యీద్విపాద మహీపజాతిని సృజించిన విధాతకుఁ బ్రపంచ మున నైవేద్యమర్పించువారు లేకుండు టేమియని యనుకొంటిని.

వచ్చినపని వాకిటనే కావచ్చినది. అయి నను, ఈ పూత మెఱుంగుల యౌదార్యమును బూర్తిగా రుచిచూచియే యఱుగుదమని నిశ్చ యించి భవనముఁ బ్రవేశించితిని. ఏవాకిటఁ జూచి నను జనుల రాకపోకలకు నిలుకడయే లేదు. చిత్ర విచిత్రముగ నలంకరింపఁబడిన వివాహశాలలో వధూవరుల ప్రక్కనగూర్చుండి యొకరిద్దరు వైది కులుమాత్రము మంత్రములు గొణుగు చుండిరి. పురోహితుఁడు హోమమును వేల్చు చుండెను. వరుడు సిగరెట్టు నొకదానిని నోటఁగఱచుకొని వంగి హోమగుండమున నంటించుకొనుచుండె. అతని వయసు రమారమి యిరువది రెండుండును. ఇంచుమించుగ వధువుగూడ నంతకుఁ దీసిపోదు. యజమానుఁడు గొప్ప సంఘసంస్కర్తయఁట.

ఆవల శాలలో సంగీతకాలక్షేపము జరుగు చుండెను. పెద్దమనుష్యులును స్త్రీలును పెక్కండ్రు వరుసలుదీరి కుర్చీలపైఁ గూర్చుండియుండిరి. ఒక గోదావరి పాటపాడుచుండగా నొక పినాకిని నాట్య

మాడుచుండెను. వేరొక్కచోట చీట్లపేక వ్యవహారము యథావిధిగా జరుగుచుండెను. మఱియొకగదిలో "గౌరవనీయులు" గొందఱు పాచకేళిలోఁ దేలుచుండిరి. ఇంకొక్కశాలలో యువకులు కొందఱుచేరి యథేచ్ఛముగా హార్మోనియమును వాయించుచుండిరి. వివాహముహూర్తమెప్పుడో, జరుగవలసిన క్రియాకలాపమేమో గమనించువారే యీసంఘమున నున్నట్లు నాకుఁ దోపలేదు. ఎన్నిచోట్లఁ దిరిగినను, ఎందెందు కూర్చుండినను, నన్ను మాటలాడించిన పాపమునఁ బోయినవారే లేరు.

మధ్యాహ్నము రెండుగంటలు మీఱుచున్నసుగూడ నాస్థితిలో నేమార్పును గలుగలేదు. దాదాపు మూఁడు గంటలప్పుడు వైదికులందఱు భోజనశాలకు నడువుఁడని యొకఁడు ఘంటవాయించుచుఁ బిలిచిపోయెను. ఈసమారాధనము సయితము చవిఁజూచి పరీక్షఁ జాలింతమనుకొని నేనును భోజనశాల కరిగితిని. నాగరకుల భోజనాదులు పది ఘడియలకే ముగిసినవఁట! ఇప్పుడు జరుగుచున్నది వైదికుల పండుగు. రమారమి రెండువందలమంది విస్తళ్లముందు కూర్చుండి యరఘంటసేపు కాచుకొనియుండు నంతలో పాగబండినదుప్పు

వారి వంటి వేషముగల వంటలవారు గొందఱు పఙ్క్తిపైఁ బరిత్యక్తులైరి. ఇఁక నాఁటి పదార్థముల సారస్యము మున్నెన్నఁడును కని విని యెఱుఁగనిది. ఆదినమున ఆమాఁడిన యన్నమునకును ఆయుడుకని పప్పునకును గలయొద్దిక వర్ణనాతీతము. పులుసును చారును మాటిమాటికిని స్నానముచేయనిదే బయట వచ్చుచుండలేదు. పాయసమన్ననో పాలును చక్కెరయునులేని వింతరకపు వంట. మజ్జిగ యయినవెనుక చేయి గడిగికొను యవసరమే యుండలేదు.

గీ॥ నేయిలేనికూడు నీయాన కసువది
కూరలేనితిండి కుక్కతిండి
ప్రీతిలేనికూడు పిండంపుకూడురా
విశ్వదాభిరామ వినరవేమ॥

అను పద్యము నాకు స్మరణకు వచ్చినది. ఆహా! వరుఁడు చింతామణి! కన్య అన్నపూర్ణ!! యజమాని యింటిపేరే అన్నదానమువారు!! లగ్నపత్రికలచే పిలువనంపి వచ్చిన యతిథుల కీయాదరము!! ఈకొట్టకూటికా యీ ఘోషశాంతి? ఈఅన్నదానము వారి యౌదార్యమున కింకెన్ని బిరుదములైనను చాలవు.

ఆర్యా! వచ్చినపని యయినది. నేఁడిం

చుక విశ్రాంతిగైకొని రేపు తమ సన్నిధికి వెడలి వచ్చెద.

అని విన్నవించుప్రియశిష్యుఁడు,
రామానందుడు."

---

## స్వభావితశక్తి
## ౧౯

సర్వజ్ఞుఁడగు నీశ్వరుఁ డేపనియును వ్యర్థముగాఁ జేయఁడు. ప్రపంచమునందలి ప్రతిపదార్థము నేదేనొక్క ప్రయోజనంబుపొంటె నాతనిచే సృజింపఁబడినది. ప్రతిమనుజుఁడు నేదేనొక్క కార్యమున కయి యాతనిచే నుద్దేశింపఁబడినాఁడు. ఏమార్గమున ననుసరింప సర్వేశ్వరుని యుద్దేశమో, ఆమార్గమునకు భిన్నముగాఁ బ్రవర్తించువాఁడు ప్రపంచయాత్రను జయప్రదముగాఁ గొనసాగింపలేఁడు. అసమర్థత, అవమానము, ఆశాభంగము, ఇత్యాదు లాతఁ డేర్పఱచిన మార్గముగాక వేరు త్రోవ ద్రొక్కుటవలననే గలుగుచున్నయవి.

తన యభివృద్ధికిని తన వారి మేలునకును గూడ కారణములగు సుగుణములు ప్రతివాని యందు నొకటి రెండైన నుండును. అట్టివానిని

స్వభావముచేతనే యెఱుఁగనగు. ప్రకృతి మాతనే నమ్ముకొని యామె యాజ్ఞలకు విధేయుఁడగువాని కామె సత్పథముఁ జూపకపోదు. అపథముఁ బట్టి పోవువాఁ డెన్నఁడు నాశాభంగ మొందఁడు. ఏలన ఆమె తన యోగ్యతకు మించినవరముల నియ్యదు. ఇచ్చినవాని నెన్నఁడును దప్పదు.

కాని, మనుజుని దురదృష్టమేమో? తన కున్నశక్తిని గణింపక తనకేదియశక్యమో యద్దానినే చేయుటకు సర్వప్రయత్నములును చేయును. బాల్యమాది తానెందు కుశలుఁడో, దానిని విడిచి తనకేది యందరాని పండో దానికై వృథాకష్టించును. అందువలనఁ దనకు స్వభావజన్యమగు యోగ్యత నిష్ప్రయోజనమగుటయేకాక తాను చేయఁదొరకొనిన కార్యము చెడుటచే నవమానమునకు మనశ్చింతకును లోనగును. స్వభావముచే గణితశాస్త్రమున నభిరుచిగలవాఁడు దేశచరిత్రకై యేల పాటుపడవలయు? చరిత్రలయందు నేర్పరి యగువాఁడు గణితమునకై యేల తలబ్రద్దలుకొట్టి కొనవలయు? తనకున్నదానిని విడిచి లేనిదాని కఱ్ఱులు సాచుటలో నేమి గౌరవమున్నది? స్త్రీ తాను దానయైయుండక పురుషుఁడుగఁ గావలెనని, మగవారివలె నుడుపుల ధరించి, మెలంగు టెంతె

హాస్యాస్పదము?

కుశలుఁడు మిగుల కుశాగ్రబుద్ధి. ధారణా శక్తియు నాతని కపరిమితము. పనియందలి పట్టుదలయు నల్లే. ఏకార్యమునైనను మిక్కిలినేర్పుతో జేయుచోఁ దనసాటిలేదని యనిపించుకొనియె. పాపమాతనికి రాని కళ కవిత్వమొక్కటే! రాదని దాని నతఁడు విడిచిన బాగుగ నుండెను. కాని యతఁడు ప్రతి నిమిషము నొక పద్య మల్లుటకు మొదలిడుచుండువాఁడు. ముగిసినను ముగియకున్నను, యతి ప్రాసము లున్నను వలసఁబోయినను, కందము గీతమయినను, గీతము దండకమయినను, లెక్కగొనక పద్యము లల్లుచునేయుండుట వాని యలవాటు. వృక్షశాస్త్రజ్ఞుఁడు దోహదక్రియచే నకాలమున ఫలింపఁజేసిన మాకందఫలమున కెట్టి మాధుర్యముండునో, స్వభావసిద్ధముగాక బలత్కార జనితమగు నాతని కవితకుఁగూడ నట్టి మాధుర్యమే యుండును ప్రకృతిమాత యుత్తమువు నతిక్రమించినందులకు కుశలునకుఁ దగిన శిక్ష గలుగకపోలేదు. కవిత్వ మతని కలవడలేదు. సరిగదా—మఱి యాపిచ్చిచే నితరకార్యముల కతఁడు గొఱగాని వాఁడయ్యె. ఇతర విషయములలో సమర్థుఁడితఁడని నమ్మినవారిచే నింతయేనా

యనిపించుకొనుచో కుశలుని కవితకు ఫలము.

ప్రకృతి యుపదేశముచొప్పున మనము నడచినచో నెంతె లెంత కార్యములఁ జేయలేము? ఇప్పు డెందరో శివాజీలు, ఎందఱు తిక్కనలు, ఎందఱు శంకరాచార్యు లుదయించు చుండిరో! ఏ కార్యమునకని ప్రకృతి మనల సృజించినదో యా పనిఁ జేయుచోఁ బ్రారంభముననే మనము సగము జయము సమకూరిన ట్లెంచుకొనవచ్చును. శివాజీ స్వభావమువలననే యోధుఁడుగావున రణరంగమున నట్టి యద్భుతకార్యములఁ జేయఁగలిగెను. కవి తిక్కనయు, శంకరాచార్యులును నట్లే; తమ కే పనియందు నేర్పుండెనో యాపనినే బూనుకొని కృతార్థులై లోకపూజ్యులైరి. వారు ప్రకృతి మాతకు విధేయులగుట ననమాన లోక విఖ్యాతిని గడించిరి. శివాజీ భారతమును దెనిఁగించుటకును, కవి తిక్కన యద్వైతము నుపన్యసించుటకును శంకరాచార్యుఁడు మహమ్మదీయులనుండి మహారాష్ట్రమును సాధించుటకుఁ బూనుకొనియుండినచో నాఁటి వీరైన నేఁడు మనము స్మరించియుండము! కావున స్వభావమునకుఁ దగని కార్యములఁ జేయ బ్రారంభించినచో నవమానము నిశ్చయమునుటు!

సుగుణ దుర్గుణములకు లింగ వ్యవస్థయుం

డదు. పైఁజెప్పిన దుర్గుణము స్త్రీలయందును గాన వచ్చుచున్నయది. ఇందిరయు కమలయు నిటు వురు నేరాండ్రు. ఇందిర మిగుల రూపవతి; ఆమె సౌందర్యమున కెట్టివాఁడును దాసుఁడు గావలసి నదే; కాని కంఠస్వర సారస్యవిషయమున నామె కోకిల పిన్నమ్మ! ఆమె సంగీతము వినువారికి క కఠోరముగా నుండును. ఇఁక కమలగాన మత్యద్భుతము. అది ఆలఁగూడఁ గరిగింపఁజాలినది. కాని యామె రూపమున రెండవ కుబ్జయే! ఆమె యాకృతి వికారస్వరూపమునకు నెల్ల! ఇందిర నోరు దెరువకుండినచో నామె సౌందర్యముఁబట్టి లోకు లామెను బూజింతురు. కమల ముఱుఁగుననున్నచో నామె గానమాకర్ణించి జనులామెను ప్రశంసింతురు. అయిన నేమి? ఇందిర పాడక విడువదు. అందఱి యెదుట నామె యేదేని పాడుచునే యుండును. వినువారికి వినుగత్తినను, ఇది త్యాగయ్య కృతి యనియు, ఇది వెంకటేశ్వరుని కీర్తన మనియును వర్ణించుచుఁ బాడుచుండును. కమలకున్న యవ కాశ మంతయు నామె యలంకారమునకే చాలదు. నిమిష నిమిషమున కామె క్రొత్త క్రొత్త వేషము వేయుచుండును. నిలువుటద్దము నెదుట నిలుచుండి యామె గడియగడియకు వస్త్ర

ఘోషములను మహోన్నతము చేసెను. కాని యామె కెన్నఁడును గాయకుని యున్న ప్రాముఖ్యముఁగట్టుకొన్న నాదు లేదు. అనభ్యాసమువలన నామె సంగీతము చెడియుఁ దగ్గిపోయెను. ఇందిర గానమును మెచ్చుకొన్నవారును లేరు. నిరంతరమును సంగీతపరిశ్రమకుఁ జిక్కి యామె తలయందలి వెలనుగూడ పోకుఁగొనెను.

మనకు స్వభావసిద్ధమైన యభిరుచిని వదలినచో సహజశక్తినిబోఁగొట్టుకొని యసమర్థులమగుటేకాక, యితరవిషయముల నశ్రద్ధఁ జూపుటంజేసి తగిన గౌరవమును సయితము గోలుపోయి ప్రపంచమున నయోగ్యుల మనిపించుకొందుము.

*If men would be content to graft upon nature, and assist her operations, what mighty effects might we expect?*

—ADDISION.

---

## కురులముడి

## ౧౭

నేను నాకార్యస్థానమును జేరినంతనే బల్లపై నాచిరునామాగల జాబొకటి కానవచ్చెను. అది యొక విచిత్రమైన లేఖ. అందలి యంశములపై

నాయభిప్రాయ మిచ్చుటకన్న. దానినే చదువరుల కర్పించుట యెక్కుడుహితమని తలంచుచున్నాఁడ. అందిట్లు వ్రాయబడియుండెః—

"ఆర్యా! సాంఘిక గుణదోషములు విమర్శించుటయు, అగతికుల కాశ్రయమిచ్చుటయును దేవర నైజగుణములని చాలకాలముగ వినుటచే నేఁడీ విన్నపమును వ్రాసి తమ కింత తొందర గల్పింప సాహసించితిమి.

మహాత్మా! మాజన్మభూమి యుత్తమాంగ దేశము. కుంతలసీమలో నేఁటికిని మాపెట్టినదే పేరు. మార్దవ కోమలత్వాది సుగుణములు మా వంశమున కుగ్గుపాలతోఁగూడవచ్చినవి. సౌందర్యమునకు ముల్లోకములలోను మాపెట్టినదే భిక్ష. దోషైకదృష్టిగలఁ కవులు గొందఱు మాయెడఁ గౌటిల్యమును గోరంత కొండంత వర్ణించిరి కాని, దానిచే నితరుల కెవరికి నెట్టియిక్కట్టునుం గల్గనియటుండ మాకును మముఁ బోషించువారికింగూడ నది సౌందర్యాతిశయమునే గూర్చుటంజేసి యది గుణముగనే సమర్థింపఁగలము.

కానసే తరతరములనుండియు మీపూర్వులు స్త్రీలనక పురుషులనక, సర్వులును మమ్ము విశేషముగ గౌరవించుచుండిరి. మా మాటయన్న

తలతో నడచుచుండిరి సదా స్నేహమునఁ బోషించిరి. పూలతోఁ బూజించిరి. వారినుండి మాపడసిన మన్ననలకై వారిని మేమెంత కొని యాడిననుఁ దీరదు ఎన్నికష్టములు వారనుభవింప నలసి వచ్చిననేమి, మాకేమాత్రమును చిక్కులు రానీక వారు జాగరూకతతో మెలంగుచుండిరి. వారు నిరాహారులైనపుడు సయితము మాకు సదా హారముల కేకొఱఁతయు రాదు. సఖీరత పవి త్రవృతమై పాసాదమున యువరాజ్యభోగము లను భవించు దినములలో మల్లెలు సంపెగలతో మమ్మ లంకరించుట పోనిండు, పతిమాత్రసహాయమై ప్రభుత్వభోగములఁ బాసి ప్రవాసకష్టముల నను భవించుచు దండకారణ్య సీమలలోఁ దిరుగు వేళ గూడ, జానకి కలివిపూవులో, గోరంట కుసుమ ములో, గోదావరిలోని తామరములో తెచ్చియైన మాకర్పించుచుండెనేకాని మాయెడ నిరాదరము చూపినది కాదు. సవతియెడ మత్సరమూని సత్య భామ పతిపై నలిగి పన్నాగము లెన్నియో పన్ని కడకు మహేంద్రుని యుపవనమునుండి పారిజాత వృక్షమునే పెకలించి తెచ్చి పెరటితోఁటలో నాటింపఁజేయుట మాకైకాదా? అంతయేల? మా ప్రసంగములేకున్నచో భారతకథయునునిస్సారమే!

నీచబుద్ధి దుస్ససేనుఁడు ద్రౌపది నవమానించి మమ్ము నట్టి నిష్కరుణుఁడై సభకీడ్చి గాసివెట్టిన కారణమున నాప్రచండమానిని పాంచాలి మాపై గినుక వహించి యెన్నియో పాట్లకోర్చి పట్టుపట్టి తుద కానీచుఁడు భీమసేనునకుం జిక్కి నిర్ఘాతపాతముం బోలు నతని ఘోరగదాఘాతపాలయి నేలఁగూలి నప్పుడా పాపి హృదయమందలి రక్తధారలచే మాం నవభృథస్నానము గావించి పగసాధించిన క్షణ మునుదలంచిన మావంశము వారందఱును నేఁడు గూడ మహోత్సవమున నిక్కకమానరు. కాని యివన్నియు దేవరయెఱుంగని యంశములు కావు.

కాల మొక్కతీరుగ నుండరాదుకాఁబోలు! ప్రాచీనసౌన్నత్యమహిమ యెంతయైననేమి! రాను రాను కాలమునకుం జిక్కి మా యోగ్యత తెల్ల వారనాగెను. అకారణముగ మాపై గొందరకు ద్వేషబుద్ధి యొదవెను. మహమ్మదీయులు జైనులు మున్నగువారు మతము పేరుపెట్టి మమ్ము నిర్దయతో ఖండింప మొదలిడిరి. ఎవరు నిరాదరించిన నే-మాయె, మా యార్యసంతతియైన మమ్ము చేవిడువదు గదాయని కొండను బలె నమ్ముకొని కొంతలో గొంత నెమ్మది పఱచుకొని కాలము గడపుచుంటిమి. కాని—మహాశయా! క్షమింతురుగాక!

క్రమక్రమముగ మాదురదృష్టఫలమెట్టిదో—వాని
సయితము మేము భారమైతిమి. పాశ్చాత్య నాగ
రకతా ప్రవాహవీచికలు ప్రసరించుకొలఁది మీ
వారికి మాపయి నసూయ బలపడుచువచ్చినది.
పులినిజూచి నక్క వాతలువేయించుకొనురీతి నొక
నిని జూచి యొకఁడు—అందున నిప్పటియువకులు—
మాపైఁ గత్తిఁగట్టనేల? శత్రువులపైఁ గత్తినాఁ
నేర్పిన మహానీయుల వంశమం దవతరించియు వా
రిప్పుడు మముఁబోటి యనదలగుఱించి సీమకత్తుల
సానదీయుదురుట! జన్మావధిగ తమ్మాశ్రయించి
వెన్నంటియున్న మమ్ము కరుణాలేశమునులేక కట
కటా! పైగ దక్షిణాత్రోడ నంగారకగ్రహమువాతఁ
ద్రోచి మొదలంట ఖండించి, చుట్టుచుట్టుకొని
నసపుకుప్పలలోఁబడి పొర్లిపొర్లి మేము దుఃఖించు
చుండఁజూచి యానందించుటకు వీరిహృదయములు
హృదయములో? గండశిలలో? పోనిండు. మా
ప్రాతు కేగాలిఁ బోయినఁ బోవుఁగాక! మమ్ముగా
న్నమానె, బోలెఁడు గొఱియ్యతుప్పుడు కుళ్ళాయి
పేరున నెత్తి నెత్తుకొనుట యలంకారమా, వికా
రమా? ఆర్యా! మానవనాగరకుల చదువున కిది
సూత్రమా పరిణామము? నెత్తి నెత్తువారున్నచో
ప్రపంచమంతయేని మోయంగలమని పిట్టపీగు

చున్న యీయన్నలకు మేమాభారము? గోషా సమాత్ర ప్రదేశమునకు మేము తగమా?

ఇంక నాగరక తరుణీమణులును మమ్ము పెక్కుచిక్కులం బెట్టుచున్నవారు. మునుపటి సొగసులన్నియును మూలంబడినవి. వారి కొప్పు లిప్పుడు మెప్పులుకావు. తొల్లింటికాలమునందు లకుం గొఱమాలిన జడలని వీరి యాశయము. కొన్నినాళ్ళు మమ్ములం గట్టిగా బిగియంబట్టి లాగిలాగి పురిపెట్టిరి. కొంతకాలము చిత్రవిచిత్ర ముగ విరచికట్టి బాధించిరి. ముగ్గులతో నలంక రించెదమను నెపమున నిలువెల్ల సూదులతోం గుట్టి సూత్రములతో బిగియంగట్టిరి అలంకారవ్యాజ మున మోయలేని భారమును మోయించిరి. తా- ము మునిగినదే గంగ కాకున్న నిట్టివా యలంకార ములు? మా సహజ సౌందర్యపు తత్త్వ మెఱిఁగి ప్రపంచమున నశించిపోకుండ చిత్రపటములలో నైన నిలిపినందుకై రాజా రవివర్మ మాకెంతేయు వందనీయుఁడు.

ఇవన్నియు నెటులో యోర్చుకొని యిన్ని నాళ్ళు గడిపితిమి. కాని ముందున్నది ముసళ్ళ పండుగ. నవనాగరకత స్త్రీలలో వ్యాపించుకొలంది మాకుం గష్టములు హెచ్చింపగుచు వచ్చినవి. నవా

సన పేరున సారాయములలో మమ్ము ముంచుచున్న వారు. ఇంతియకాదు. స్వేచ్ఛగఁ బెరుగనీక నుమ్మెప్పుడెప్పుడు కత్తిరించునాచారము ప్రారంభ మయ్యె. ఆర్యా! మాకేమో భయమగుచున్నది. ఇఁకఁ గొన్నినాళ్ళలో యీ నాగరకత సబ్బు రథ ముపై నెక్కి- సీమకత్తులు నూఱుచు మాపై నిర ర్గళముగ దండయాత్ర వెడలఁగలదనియు అప్పుడు స్త్రీ పురుషులలో నెవరుగాని మాకభయమిచ్చి మమ్ము పోషించువారే యుండరనియు మాకు సూచనలు స్పష్టముగ గానవచ్చుచున్నవి. ముకు పటి కవులు స్త్రీలనుమాత్రము వర్ణనలకై పూ బోడులనిరిగాని యిఁకమీఁదు పూలులేకున్న పీడ పదలినది—స్త్రీలను పురుషులనుగూడ నాపేరునఁ బిలుచుకాలము రానున్నది కాఁబోలు?

మహాశయా! మ్మాగతి యెవరు విచారించు వారు? మీరైయిన మాపైఁ గరుణించి సంఘ మునకు హితము చెప్పరాదా?

ఇట్లు విన్నవించు,

కురులు.”

# ప్రపంచయంత్రము.

## ౧౮

అనుదినమును మనము చిత్రవిచిత్రములగు యంత్రములను జూచుచున్నారము. ఏ యంత్ర మెంతదృఢమైననేమి, చాలకాల మొక్కతీరుగఁ బనిసేయదు. నడచి నడచి కీళ్ళరిగిపోయి కొంత కాలములో నిరుపయోగములగుటచేఁ గ్రొత్తకీళ లమర్పవలసి యుండును. అనుక్షణమును తదంగ సంధులలో దుమ్ము ధూళి చేరుకతమునఁ గాలక్రమమున నవి చెడి తుప్పుపట్టి యంత్రము తనపని తాఁ జేయనేరనిదగును. యజమానుఁ డదనెఱిఁగి తగిన పనివాని నియమించి యందలి మాలిన్యమును దొలఁగించి చెడినకీళ్ళను బుచ్చి కందెన వేయింపక తామసించెనా, యంత్రము గొంతకాలమున నెందునకుం గొఱమాలినదగును.

"ఇనుమునఁ గందెన పెట్టక,
పరమేశ్వరు బండియైనఁ బారదు"

కదా?

మన ప్రపంచముగూడ నొక గొప్పయంత్రము. సృష్టికర్తయధీనమున నిరంతరమును విసు విరామములేకపనిసేయు యంత్రరాజ మిది! కాననే, దీనికి నయిత మప్పుడప్పుడు 'మరమ్మతు'కా

లసియుండును. కాలక్రమమున సంఘమధ్యమున నీచులు గొందఱుచేరి ధర్మమునకు మార్గము సుకరముకాకుండ జేయుదురు. ఆకారణమున సంఘమర్యాదలన్నియుఁ గ్రమ క్రమముగ త్రుప్పు పట్టును. నీతిపద్ధతులన్నియు బిగువులుసెడి కీళ్ళు తప్పును. అప్పుడీయంత్రము యజమానుని యుద్దేశమునకు భంగముగా నడువ నారంభింపఁ గలదు. అట్టివేళలలోఁ దగిన యధికారి యొకఁడు వెంచేసి నలుసులఁ దొలగించి మరల బిగించి కందెనవేయకున్నచో గతియేమి?

ఇట్టి యధికారు లప్పుడప్పుడు వచ్చుచుందురు. చరిత్రలలో దృష్టాంతములు పెక్కులు చూపవచ్చును. తొల్లి వైదికమతాచార విధులు మలినములై పరమార్థ తత్త్వము జనులకందరానిదయ్యె. అసంఖ్యములగు ననార్యాచారములచే సంఘము శరీరక్షీణతనొంది మానవజాతి తుదకేవ్యాపత్తి నాపాదింపఁజాలిన దుర్నయముల కలవాటుపడెను. దేవుని పేరునను, మతముపేరునను. మితిలేని జీవహింసలు జరుపఁబడుచువచ్చె. దేవుఁడు లేకున్న నొక వేయి నమస్కారములు! అతనిని సమర్థింపఁ జేయఁబడుచుండిన దురాచారముల నాపుట యనవశ్యకముగ నున్నదని. మహాత్ముఁడు

గౌతమ బుద్ధుఁ డుదయించి యాపని నెరవేర్చెను. భూతదయాగుణమును మరల నీయార్యభూమిలో నుజ్జీవింపఁ జేసెను.

కొన్ని వందల యేండ్లకాలములో మరల మన దేశమున కింకొక గొప్పకష్టము దాపరించెను. గౌతమ బుద్ధుని బోధనములలోని వాస్తవమును మరచిపోయి జనులు శుద్ధ నాస్తికులైరి. మత విషయమున నరాజకత్వ మేర్పడి శాఖ లనేకములు బయలు వెడలెను. ఈనాస్తిక వాదమున రుచి లేక యనాగరకు లనేకులు మరలఁ దమ మునుపటి పద్ధతుల శరణ మాశ్రయించుచువచ్చిరి. సంఘశక్తి పరిక్షీణత నొందుటయే ఫలమయ్యె. మతముపై పీరావేశమున నెంతపని కయినను జాలిన యన్య దేశీయులు గొంతకాలముననే యిచట నపార సేనతోఁ బ్రత్యక్షము కానుండిరి. ఒక దేవుని నమ్ముకొని యొక మతమునందభినివేశము గల్గిన జనసంఘ మాత్రరుణమున లేనిచో నేఁటికీదేశమున నార్య సంతతియే పేరు మాసి యుండును. కాననే శంకరాచార్యుఁ డుదయించి యాస్తిక మతమును బోధించి సమయమును గాపాడఁ గలిగెను.

కాని జ్ఞాన ప్రధానమయిన శంకరమతము సామాన్య జనులలోఁ జాల కాల మైకమత్యమును

నెలకొల్పఁజాలినది కాదు. క్షణ క్షణమును శత్రువుల దండయాత్రలచే హైందవ జాతీయతకే లోపము గలుగనున్న యాకాలమున సంఘీభావము చాలనవసరముగఁ దోఁచెను. రామానుజాదులు మత సంస్కర్త లుద్భవించి సర్వ సులభమగు వైష్ణవ మత ముపదేశించి మరల సంఘశక్తిని నిలిపిరి. వీరి యుపదేశముల విలువను మహమ్మదీయ సామ్రాజ్యపు టంత్య దినములను వర్ణించిన చారిత్ర్యకారులు బాగుగ నెఱుంగుదురు.

ఇట్టి మహనీయు లవతరించుట మత సంస్కారమునకు మాత్రమే కాదు. తొల్లి గ్రీసు దేశపురాజులు చాల బలవంతులై యితర దేశముల నెల్ల నాక్రమింపఁ గోరిరి. అలెగ్జాండరు చక్రవర్తి యపార సేనతోడ నీదేశముం జొచ్చెను. అప్పటి కాలమున గ్రీసు దేశమునందలి జనులనీతి మిగుల శోచనీయ మగు నీచదశలో నుండినది. వారీ భారత భూమిని జయించి యిందు శాశ్వత సామ్రాజ్యమును నెలకొల్పి యుండిరా, వారి దుర్నీతి బీజము లిచట నాటుకొని నేటికి మ్రాకులై యూడలు వారి యుండును. ఆ యాపద నుండి మన దేశము నుద్ధరించుటకై చాణిక్యుఁడును చంద్రగుప్త చక్రవర్తియు జనింపవలసి యుండెె.

ఇఁక, ఔరంగజేబు కాలము నాటి మన దేశపుస్థితి యోకించుక స్మరింతము. మహాత్తరమగు మతాభిమానము గల్గి యన్యమతాసహిష్ణులగు మహమ్మదీయులు భారత దేశమున పాలకపదవి నధిష్ఠించి యుండిరి. ఆర్య మతము లన్నియుఁ దమ సనాతన ధర్మములఁ దురుష్కుల పాలు గావించి పేరు పెంపులేకుండ నణఁగిపోవ సిద్ధముగ నుండినవి. దేవాలయము లన్నియు మసీదులుగ మాఱిపోవ సాగెను. భారత మహిళల మానము లెల్ల బజారున విక్రియింపఁబడు చుండె. వేళ మీఱక శూర శిరోరత్నము శివాజీ యవతరించి ఘోంగి పోరలి యార్భటించుచు వచ్చుచున్న మహమ్మదీయ మతప్రవాహమునకు జెలియలి కట్టయై నిలువంబడి దేశమునుమతమును జాతీయతను సయితము నిలువంబెట్ట గలిగెను.

మఱియు, ఆంధ్రభాషాయోషామణి యనదయై యున్నపుడు- ఆంధ్రు లాశ్రియ విహీనులై చెల్లాచెదరై యున్నపుడు- ఆంధ్రభూమి పరివారి కన్నులలోఁ జొకగఁ బరిణమించు స్థితి దాపరించి నపుడు- జనించి, భాషతోడ జనులను దేశమును సముద్ధరించి మానము గాపాడి పేరు నిలువబెట్టిన యా మహామహుఁడు విజయనగరచక్రవర్తి మూరు

రాయర గండఁడు కూడ నిట్టి మహనీయులలో నొక్కఁడు.

ఇట్టివారినే మనవా రవతార పురుషు లనుట; భగవదంశ సంజాతులని పూజించుట క్రీస్తువు, మహమ్మదు మున్నగు వారును దేశాంతరములలో నిట్టి కార్యములకే యుదయ మందిరి.

ప్రపంచమున ధర్మలోపము సంభవించిన వేళ నిట్టివారిని సృష్టి కర్త పంపి సంఘమును మరలఁ జక్క చేయించు చుండును. అట్లుకాక, "కానున్నది కాక మాన"దని యూరక చూచుచుండెనేని యాసోమరి సృష్టి కర్తకన్న కలిపురుషుఁడే మేలగునుగదా? అట్టి సంఘము కన్న వేఱు నరక లోక మేల? శ్రీ కృష్ణభగవానుని వాక్యము లివి స్మరింపుఁడు:—

"యదా యదా హి ధర్మస్య
గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య
తదా త్మానం సృజా మ్యహం"

—భగవద్గీత.

# సదయుని కథ
## ౧౯

నర్మదానది యొడ్డున విలాసధామ మను నగరమునందు సదయుడను పేరుగల యైశ్వర్య వంతుఁ డొకఁడుండెను. పేరుంబట్టి యాతఁడట్టి వాఁడయ్యెనో, కాక యాతనిగుణముల దివ్యదృష్టి నూహించి పెద్దలాపేరతని కిడిరో చెప్పలేనుగాని స్వభావముచేతనే సదయుఁడు మిగుల దయాళువు. బంధు మిత్రులనేగాక జన సామాన్యమును గూడ నతఁడు బాల ప్రేమించుచుండెను. అతనిచే మంచి వాఁడని యనిపించుకొనని వాఁడును, అతనిని చెడ్డ యనినవాఁడును లోకముననే యఱిది.

అతని యౌదార్యము వర్ణనకు మించినది. ద్రవ్యము నంతయు నతఁడు పేదసాదల నుద్ధరించుట యందును స్నేహితుల సంతోషింపఁజేయుట యందునే వినియోగించెను. పాత్రతా పాత్రతల విచారము లేక యెడతెగని ప్రవాహమువలె నతని యీవి ప్రవహించుచుండెను. అతిథి షడ్ర సోపేతమగు భోజనములేక వెళ్ళుటలేదు; అర్థి రిక్తహస్తముల వెనుక కెన్నఁడును దిరిగి పోలేదు. కవులును భాగవతులును బహుమతిఁగొనక వెడల లేదు. లేదన్నమాటఁ లేనే లేదు. విందులు

జరుగని దినమే లేదు. బంధువుల రాకపోకలకు విరామము లేదు. అతని యిల్లొక గొప్ప సత్రమై యుండెను. ఉన్న యెడల రాజ్యములఁ గూడ నొసఁగు దానమిచ్చు వాఁడే. వీఁడు వాఁడనక యా బాల చండాలము సదయుని యాదరమున బా- త్రులైన వారే. అతనినందఱును ప్రేమించిరి; పొగడిరి; అతని కార్యముల నాసక్తితోఁ జేసిరి.

గొప్పయింటి తరుణ వయస్కులు గొందఱు ధనమంతయు విచ్చల విడిగా పాడుచేసి యప్పుల పాలై తీర్చు నుపాయముఁ గానక చెఱసాల యందుండఁగా సదయుఁడు వారియ్యవలసిన మొ- త్తము నిచ్చి వారి చెఱవిడిపించెను. వారెప్పుడు నతని విడచి యుండలేదు. పొరుగింటి యాతఁ డొకఁడు గొప్పయింటి కూతు నొక దానిని వరించి, యామె తండ్రి యైదువేలుంకవ, డెమ్మని నందున నిరాశఁ జెంది యుండఁగా, సదయుఁ డాతని కా సొమ్మొసఁగి వివాహముగావించెను. స్త్రీ ప్రియులగు నీచు లాతని చుట్టుఁ జేరి యాతని ధన మెల్ల నపహరించిరి. కాని,

"కలిమి లేమి యెల్ల కాలము
కుల గిరులా కదల కుండ"?

సదయుఁ డచిరకాలముననే దరిద్రుఁడ-

య్యెను. అప్పులవారి నిక్కచ్చి చెప్పరానిదయ్యె. ధనము స్నేహితులకే యిచ్చితిని కాని, దుష్టుల కిచ్చి పాడు చేయలేదనియు, తనవలన నంతే మే లొందిన మిత్రులు గష్టకాలమునఁ దనకు సాయ పడరా యనియు, సంతోషమాత్రము కృతజ్ఞత తన చెలికాండ్రకు లేదాయనియు నతఁడు చాల నొచ్చి యుండెను. కాని యెవరు తన నొక్క నిముసమేని పాసి యుండఁజాల మని దుఃఖము నభినయించు చుండిరో యట్టి సఖులు లాతఁడున్న వీథినైనఁ బోవు టకు మానుకొనిరి. ఆ యీతని నెవ్వరు స్తోత్రము సేయుచుండిరో వారే, "ఇతఁడెంత తెలివిమాలిన వాఁడు, అంత దుర్వ్యయము మంచిదేనా?" యని తెగడసాగిరి.

మనుష్య తత్త్వ మాతని కిప్పుడు బాగుగ బోధపడినది. తానిదివఱకు స్వప్నమునఁ గూడఁ దలఁచి యెఱుఁగని వేనవేలు లోపములు మను ష్యునియం దున్నవని యతఁడు కనుగొనియెను. మనుష్య సంఘము మీఁదనే యతనికి రోఁత పుట్టెను. మనుష్యుని వంటి కృతఘ్న జంతు వీ ప్రపంచమున నే యుండదని యాతని తలంపు. అతని దృష్టి యెచ్చట ప్రసరించినను కృతఘ్నత, ద్రోహము, మాయదారితనము, అసత్యము, స్వా-

ష్టపవత్త్వము దప్ప వేఱు గానవచ్చుటే లేదు.

నీచాతి నీచమగు మనుష్య మృగమునకు నివాస యోగ్యములగు పట్టణము లందుండ రాదని యెంచి సదయుఁడు, విలాసధామమును విడచి యొక్కఁడు నొక్క ఘోర కాంతారముఁ జేరెను. అచటి పక్షులు మృగములు నతనికి స్వాగత మిచ్చినట్లుండె. అందలి పచ్చికయు, రమ్యములగు ఫలపుష్పములచే నిండిన తరు లతాదులును, జల జలమని నిర్మలోదకముల ప్రవహించు సెలయే-ళ్ళును జూచి యతని మనసు చల్లబడియెను. మానవ హృదయముల కన్న నచటి గండశిలలు కోమలములని తోఁచెను. స్తుతి పాఠకుల ప్రసంగ ములకన్న సింహ శార్దూలాదుల గర్జారవములు మధురములయ్యె. మిత్రుల ప్రశంసా వాక్యములలో నున్నంత విషము పాముల కోఱలలోఁగూడ నతనికి గానవచ్చినదికాదు. క్రమముగ మనుజుని వేషము గూడ నాతనికిఁ గిట్టలేదు. నీచుడగు మనుష్యునిఁ దలఁపునకుఁ దెచ్చునని, మనుష్య ద్వేష మాతనిని వస్త్రములను విప్పివైచి దిగంబరుఁడుగాఁ దిరుగు నట్లు చేసినది.

చలి కాలము వచ్చెను. సదయుఁడు శాంత ముతో చలి బాధను సహించె మనుజులవలె

నసత్యములు చెప్పక యీచలిగాలి యథార్థస్థితిని తనకుఁ జెప్పుచున్నదని యతఁడు సంతోషించెను. కృతఘ్నతకు నున్నంత పదను చలి పంటికి లేదని యాతనితలంపు. పక్వములును మధుర ములునగు నానావిధ ఫలములఁ దినుచు నిర్మలము-లును శీతలములు నగు ఝరవారి నీరువట్టార్చు కొనుచు, విశాలములును ప్రశాంతములునగు గిరి కందరముల విశ్రమించుచు పత్ర పుష్ప ఫల భరిత ములగు దట్టంపు మ్రాకుల నీడల నీమానవ శరీర మును బాపుమని సర్వేశ్వరుఁ బ్రార్థించుచు నా-తఁడీ యరణ్యమున గొన్నిదినములు నిశ్చల చి-త్తుఁడై యుండెను. సకల దుర్గుణములకును మూల కందమగు మనుష్య కీటము భూమినుండి తొలగింప వలెననుట దప్ప యాతనికి వేరు కోరికయే లేదు. అతఁడీశ్వరుని బ్రార్థించిన దిదియే.

సదయుఁ డొకనాఁడు కాంతార మధ్యమున నున్న తటాక తీరమున నిలుచుండి చుట్టునుం జూచెను. క్రూర మనుష్య మృగము లేనందున నాయడవి సహజ సౌందర్య సంపదచేఁ గడు రంజిల్లు చుండె. మావి చిగుళ్ళ గుబురున నుండి కోయిల "కూహూ"గానమున ప్రపంచమును సంమోహి-తము జేయుచుండెను. చెరువ నిసుక తిన్నెపై

నొక నెమలి రంగులపురి విప్పి రమ్యముగ నర్తన మొనరించుచుండె. సెలయేటి తరంగములు మృదు మధుర స్వరములతో మృదంగము వాయించెను. తటాకమున జలపక్షులు ఱెక్కలల్లార్చుచు కర తాళ ధ్వనులు చేసినవి. పచ్చికపై పారణసేయు జింకలును పొదలలో నరనిద్రలోనున్న పులులును హాయిగ నీగానము ననుభవించుచుండెను. తరు లతాదులు ప్రేక్షకులకు ఫలపుష్పముల నుపాయన మర్పించుచుండె! అకటా! స్వార్థపరమగు మానవ ప్రపంచమున నీయానంద మెందుండి వచ్చును! సదయుఁడు చూచి చూచి యుప్పొంగెను. కోయిలగనో, జింకగనో, తన కపుడు జన్మమబ్బినచో నెంత సంతసించి యుండునో.

భగవంతునిచే సృష్టింపఁబడిన జీవరాసు లన్నిఁటిలో మానవుఁడే యెందునకుఁ గొఱమాలిన నిరర్థక జంతువు. అడవిలోని క్రూర జంతువులు గూడ తమ కాహారమయిన మృగములఁ దప్ప నితర మృగముల జోలికిఁబోవు. క్షుద్రజంతువు-లును తమ భోక్తను దప్ప యితర మృగములను ద్వేషింపవు. మనజుఁడన్ననో స్వభావము చేతనే సర్వజంతువులను ద్వేషించును. ఆనంద మయమగు నీప్రపంచమున నానందము లేనివాఁడు మానవుఁ

డొక్కఁడే! ఈదుర్గుణముల కలవాటుపడని మానవులలోకమే లేదా? భగవంతుని సృష్టి కిది యసాధ్యమా? నిజముగ నట్టే కాఁబోల?

ఇట్లు తలపోసి తలపోసి "ఛీ! ఈ నీచ దేహమును భరింపఁజాల! సర్వేశ్వరా! మంచి లోకమున నన్ను సృజింపఁ జాలనిచో నాకు మానవ దేహమేవలదు. కీట జన్మమైన నిమ్ము!" అని యుచ్చైస్స్వరమున నాడి, దభాలున నాతటాకమున దూకి మునిఁగిపోయెను.

నిజమరసినచో మనలో సదయు లనేకులులేకపోలేదు వీరే తనకుసర్వస్వమని నమ్మికొనియున్న దారపుత్రాదుల కృతఘ్నత వలననో, మిత్రుల మోసము గారణముగనో, సుఖనాశము సంభవించినప్పుడు - ఆశా భంగ మావహిల్లి నప్పుడు - ఉత్సాహ శక్తి యడుగంటి నప్పుడు - ఆనంద కళ యంతరించి నప్పుడు - మనుజునికి చుట్టునున్న ప్రపంచముపై ద్వేష మొదవు టేమియరుదు? "అనాశ్వాసిత దుఃఖితే సర్వ మసహ్యమనా నెఱుంగవే?" యను నానుడిఁ బరికింపుడు.

కాని సదయుని స్థితి యేమయినదియు కనుఁగొందము. చదువరులు గొంత కాలము వేచి యుందురు గాఁత!

# నా రహస్య స్వప్నము. (1)

౨౦

ఒకొొకప్పుడు నే నేదే నొక విషయముం గూర్చి ధ్యాన నిమగ్నుఁడై యుండుట వాడుక. అప్పుడు నాకీ బహిః ప్రపంచము పై జ్ఞానము తప్పి యుండును. నా యంతరాత్మ యెం దెందో చరించు చున్నట్లును, ఏవేవో వింత వింత విషయములు నాకు గోచరించు చున్నట్లును, నా కపుడు భావానుభవము గలుగును. కొన్ని వేళల నట్టి ధ్యానముద్రల యందలి యనుభవములచే సా-మాన్యముగ నిర్ణయింపరాని యనేకాంశముల నిదమిత్థమని నిర్ణయింపఁ గలుగుటయు నా యనుభవము లోనిది.

కడచిన సరస్వతీ పూజా దినమున నాకట్టి యనుభవ మొండు కలిగెను. తోడనే నా మిత్రులకు దాని నెఱిఁగింప నుంకించితిఁగాని దేవరహస్యమని తోఁచి యించుక జంకితిని. నాపట్ల నిది కేవల స్వార్థపరతయని నా మనసు నా చెవి నిల్లుగట్టుకొని పోరుచు వచ్చినందున నేటికీ రహస్యము లోకోపకారార్థమై వెలువరింపఁ గల భాగ్యము నా కబ్బినది. చదువరులు క్షమింతురు గాక!

నాఁటి సాయంతనమున నాగదిలో నే

నొంటరిగఁ గూర్చుండి యుంటిని. ముందు బల్లపై సరస్వతీ చిత్రపటముండెను. నేనా మూర్తిని తదేక ధ్యానమునఁ జూచుచుండు నంతఁ గొన్ని క్షణములలో నా కన్నులు మూతలు పడినవి. ఈ భౌతిక ప్రపంచము తెర మఱుగైనది. నూతన నాటక మొకటి యారంభమయ్యెను. ఒకటి వెనుక నొకటిగఁ గొన్ని చిత్రవిచిత్రములగు రంగము లగుపడి నేత్రపర్వము గావించినవి. వింత యేమన, ఆనాటకమునఁ బ్రేక్షకుఁడు మాత్రము కాక నేనుగూడ నొక పాత్రముగాఁ బరిణమించితిని. ఈ విచిత్ర నాటకమునకు నటీ సూత్రధారులు మాత్రము నాకగుపడిన వారు కారనుట నా యభాగధేయంపు ఫలము. ఆహా! మందార కుసుమ వాసనలచే గుమాళించు కల్ప వృక్షముల పూఁదోఁట యొక రంగము. రాజహంస విహారములచేఁ గనుల పండువు గావించు కనక కల్హార కదంబ పరిశోభితమగు మానస సరోవర పుణ్యతీర మొక రంగము. కర్ణ పేయములగు మహర్షి సామ గానములకుఁ బ్రతి ధ్వను లిచ్చు శారికా కీరరాజములచే శోభితమగు దివ్య వనభూమి మఱి యొక రంగము. వీని వర్ణనల కిపు డదనుకాదు. సర్వము దివ్యము, నమూల్యము, ననిర్వాచ్యము,

నతి మనోహరమనుట చాలును.

కొన్ని క్షణములలో నేనెట్లో యొక మహోన్నత భవనంపు శాలలో నుంటిని. కన్నెదుట- నా యదృష్టఫల మేమి చెప్ప—శ్వేత పద్మాసనమున, కోటి చంద్రప్రభా భాసమానయు, నవరత్నమయ వీణాదండ పరిశోభిత పాణిపంకేరుహాయు, ననిర్వాచ్య దివ్య మంగళ విగ్రహాయు నగు దేవి యొకర్తు దృష్టిగోచర మయ్యెను. ఒక ప్రక్కన వేదఘోషలు సలుపుచుఁ దెగ బారెడు తెల్లని గడ్డముల నిమురుకొనుచున్న వయోవృద్ధులు వినిర్మల బ్రహ్మతేజో విరాజితులు కొందఱు దర్భాసనముల నాసీనులై యుండిరి. వేఱొకప్రక్కన సాహిత్య ప్రసంగములు గావించుచు దేదీప్యమాన విగ్రహులును నభినవ తారుణ్య కళా భూషితులు నగు దివ్యమూర్తులు కొందఱు రత్నాసనముల నలంకరించి యుండిరి.

కంతుని సతిని దిసంతుగొట్టఁజాలు తరుణీమణులు కొందఱు దేవి పురోభాగమున రాగ్గరగించు గానకళతోడ నభినయించు చుండిరి. ఆవల కోట్లకొలఁదిగ నంజలిబద్ధులై దివ్యపురుషులు నిలిచి దేవికి నానావిధోపచారములు సలుపుచుండిరి.

ఆ మహాభవనరాజపుఁ బరికాళము, ఆదివ్య వ్యక్తి యనుభావ విశేషము, ఆసభాసదుల తేజః పుంజము, ఆ దివ్యసుందరుల యమూల్యాలంకార-శోభ, అన్నియు నొకమారుగ నాకన్నుల మిఱుమిట్లు గొలుపుటంజేసి దిగ్భ్రాంతుఁడనై నిమీలితనేత్రుఁడనైతిని. నా దేహము పులకితమై స్తబ్ధమయ్యెను.

కొన్ని నిమేషములకుఁగాని నాకుఁ గన్నులఁ దెరచు శక్తిరాలేదు. ఆలో నొక్కింత చింతించి నా యున్నరంగము సత్యలోకమనియు, నా దివ్య మంగళమూర్తి వాణి యనియు నిర్ధరించుకొనఁ జాలితిని. కన్నుల విచ్చితిఁగాని యానంద బాష్ప ప్రవాహ వేగమున నాకేమియు గానవచ్చినదికాదు. భాగ్యము పండెనని యాదేవివైపు చేదోయి జోడించి, సాష్టాంగ ప్రణామ మాచరించి, వినయ వినమితోత్తమాంగుఁడనై నిలుచునంతలో నిరవధిక కరుణారాశియగు నాదేవి మాతృవాత్సల్యముట్టిపడ "వత్సా" యని కనుసైగచే ననుచేరఁబిలిచి దీవించెను. హర్షోత్ఫుల్ల లోచనుఁడనై యామాతృమూర్తి యలంకారము ననిమేషదృష్టితోఁ గనుంగొనుచు నట్లేనిలిచి నిర్విణ్ణుఁడనైతిని. నాఁటి దృశ్యము నేఁటికిని నాకనులఁ గట్టినట్లున్నది.

మానిషాద ప్రతిష్ఠాంత్వ
మగమశ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచ మిథునాదేక
మవధీః కామమోహితం

అను శ్రీమద్రామాయణకావ్య మూల శ్లోకము వాగ్దేవి నెన్నుదుట కస్తూరి తిలకముగఁ బ్రకాశించుటఁ జూచి యబ్బుర పడితిని. భాగవత సూక్తి ముత్యాల ముంగరగఁ గన్పట్టెను. మృచ్ఛకటికా నాగానందములు తాటంకయుగమై తళతళ మెరయుచుండె. భాస నాటకములు కర్ణపూరములుగఁ గానవచ్చినవి. అభిజ్ఞాన శాకుంతలము నాయకమణిగాఁ గాళిదాస కావ్యత్రయము వాగ్దేవికి గంఠాభరణముగ నొప్పుచుండినది. ఉత్తరరామచరిత్ర ముద్దుల ముక్తాహారముగఁ జూపట్టెను. రత్నావళి రత్నావళియే కిరాతార్జునీయము కేయూరభావము వహించినది. భారత రామాయణ చంపువులు ముత్యాల మురుగులు గను, శిశుపాలవధ నైషధకావ్యములు మణి కంకణములుగను విరాజిల్లు చుండెను. హంస సందేశము ముద్దుటుంగర మయ్యెను. దశకుమార చరితము తళుకుకంచుకముగను, కాదంబరి కనకాంబరముగను దేవిని సేవించుచుండినవి. వాసవ

దత్త బంగరు మొలనూలుగఁ గనుపట్టెను.

అమృతధారలోలుకు కనకకల్హారమై గీత-గోవిందము దేవికరము నలంకరించెను. అనర్ఘ రాఘవము మణి మంజీరత్వమును ధరించియుండె. ఆదేవి పాదసీమ నలంకరించియున్న భూషణములు కోటికి మించియుండినవి. వానినిఁ జేర్కొన శేషాహికైనను దరముకాదన్నచో నాయట్టివాని మాటయేమి? ఇవికాక లక్షలకొలఁదిగ సొమ్ము-లను బంగరు పళ్ళెరములలో నిడుకొని మాత కర్పింపఁగోరి యనేకులు కాచియుండిరి. కాని దేవి వారికడ కటాక్షించినది కాదని వారివిషణ్ణ వదనములే చాటుచుండెను. ఈ వింతలన్నియుఁ జూచిచూచి నే నెంత యుప్పొంగితినో, ఇప్పుడు వ్రాయజాల.

దేవికిఁ జేరువనున్న యా వృద్ధులు నాతరు-ణులు నెవరోయని యెఱుంగఁగోరి వారికడ తేరి పారజూచునంతలో నాభావ మూహించిన వాగ్దేవి కటాక్షమందలి యాజ్ఞనాదలఁబూని యొకదివ్య పురుషుఁడువచ్చి యాసభాస్తారుల పరిచయము నొక్కింత నాకొసంగి నను ధన్యునిగావించెను. ఆ వృద్ధులు వశిష్ఠ విశ్వామిత్రాది బ్రహ్మర్షులకిఁ మొక్కింగి వారి కంజలి యొనర్చితిని. దేవిని

జరిచర్య సలుపుచున్నవారు దిక్పాలురనియు, గానము సేయుచున్నవారు రంభా ద్యప్సరస లనియు విని యానందించితిని. రెండవప్రక్కనున్న దివ్యతరుణ మూర్తులు మహాకవులని యాపురుషుఁడు నాకెఱిఁగించెను. వారిలో దేవికన్న నున్నతాసనమున నాసీనుండై యున్న మహనీయుఁడు వల్మీకభవుఁడఁట! అతని నాశ్రయించియున్న వ్యక్తి పారాశర్యుఁడు. కాళిదాస కవితిలకుఁడు దేవికి సమీపమున సమానాసనము నధిష్ఠించి యుండె. దాపునఁ గూర్చుండి యతనిని సాసూయముగఁ జూచుచున్నవాఁడు భవభూతి. వారికిఁ దరువాత భాస, శూద్రక, శ్రీహర్ష, మాఘ, బాణ, దండి, భారవి, సుబంధు, భోజ, జయదేవ, మురారి ప్రముఖులగు మహాకవులు యథార్హముగ పీఠముల నలంకరించి యుండిరి.

ఇట్టి మహానుభావుల నిందఱ నొక్కమాఱుగ దర్శించుభాగ్యము సేకూరుట కెంతో సంతసించితిని, గాని యంతలో నా హృదయమున నొక విషాదము జనించెను. నా కంటఁ బడిన దంతయు గీర్వాణవాఙ్మాలమే; గీర్వాణ కవిబృందమే. ఆంధ్రకావ్య మొక్కటేని, ఆంధ్రకవి యొక్కఁడేని వాగ్దేవికడ కానరామి నాకెంతో

తలఁగొట్టినట్లయ్యెను. మన దేశముపై, మనభాషపై, మన కవులపై, భాషాసతికి వాత్సల్యము లేదా? ఆమెకిది పక్షపాతమా, కాక మనకిది యభాగ్యమా? లేక,

"దేశ భాషలందుఁ దెలుఁగు లెస్స"

యని విఱ్ఱవీగుచున్న మన కిది గర్వశాంతియా? నాకనుల నానందభాష్పము లొక్క క్షణమున శోకాశ్రువులుగ మాఱెను.

అంతలో నా హృదయాంతరాళమునందలి యీభావము నెట్లు కనుగొనెనో కాని, వాగ్దేవి "వత్సా! ర"మ్మని ననుఁ జేరఁబిలిచి "ఆంధ్రభాష నాప్రీతికిఁ బాత్రముకాదని నీవు శంకింపకుము. దేశభాషలలోనెల్ల నాయకమణియగు నాభాషయు తత్కవులును నాకు మిగులఁ గూర్చువారు. మరల నొకమారుచూడుము" అని యానతిచ్చి కరకలిత కల్హార మరందధారచే నాకనులఁ దుడిచెను.

కంఠగతమైన యుత్కంఠతో నేనును కనుల విచ్చి దేవిని చూచునంతలో, అయారే! ఏమి నా భాగ్యము! ఇంద్రజాలప్రభావముసంబలె సర్వమును మార్పుసెంది నాకపరిమితాశ్చర్య మొదవించె.

తరువాతి కథకై చదువరులు కొన్నాళ్ళు వేచియుందురు గాక.

# సారస్వతస్వప్నము

## ౨౧

నేఁడు నాయప్పు తీర్పవలసియున్నది. క్షణమాత్రమట్లు ముకుళితనేత్రుఁడనై మరలఁ గనులఁ దెరచునంతలో దేవిమాహాత్మ్య విశేష మేమో కాని ఆమె యలంకారములన్నియు మార్పుసెంది యుండి నాకపరిమితాశ్చర్య మొడఁగూర్చెనంటిని. సత్యము.

ఉ॥ శ్రీయన గౌరినాఁబరఁగు చెల్వకుఁ జిత్తము పల్ల
వింప భా। ద్రాయతమూర్తియై హరిహరంబగు
రూపముదాల్చి విష్ణురూ। పాయ నమశ్శివాయ
యని పల్కెడి భక్తజనంబు వైదికా। ధ్యాయు
తకిచ్చు మెచ్చు పరతత్త్వము గొల్తునభీష్టసిద్ధికై॥

అను పద్యరాజము వాగ్దేవి నెన్నుదుటఁ గమ్మని కస్తూరి తిలకముగఁ గాననయ్యెను. పార మెఱుంగని యానంద రసాతిరేకమునఁ గనుల బాష్పకణములు రాలఁ గొంతతడవట్లే స్తబ్ధుఁడనై నిలిచి యనిమేషభావమున నావ్యక్తిం దిలకించితిని. ఆంధ్ర మహాభారతమునందలి యాదిపర్వము సూ-ర్యవంకగను, సభాపర్వము సీమంతమణిగను, అరణ్య పర్వము చంద్రవంకగను దేవి శిరోభాగమున ధగ ధగ మెరయుచుండినవి. ఉద్యోగపర్వము కలికి

తురాయిగ నాంధ్ర పంచమవేద శేష మిపుడు మణి కిరీటమై మెఱుఁగు లీనుచుండెను. హరివంశకావ్యములు రెండును రవల తాటంకములై మిస మిసలాడుచుండినవి. భాగవతము స్వచ్ఛమై తళతళలాడు నాసామణిగ మాఱియుండెను భాస్కరునికృతి కంఠాభరణ మయ్యెను. చవులదేఱు మంచి ముత్తియముల హారమై మన మనుచరిత్రము నిగనిగలాడు చుండెను. దాని జతనున్న సానలఁదీఱిన జాతిరత్నముల హారము మన వసుచరిత్రమే. ఆముక్తమాల్యద రత్నకేయూరమై, రాఘవపాండవీయ హరిశ్చంద్రినలో పాఖ్యానములు మణికంకణములై దేవిని సేవించినవి. జైమినిభారతము పచ్చల పతకమైనది. సొగసు కంచుకమై శృంగార నైషధమును, బంగరువ్రాతగల పట్టుపుట్టమై కళాపూర్ణోదయమును బ్రికాశించినవి. పారిజాతాపహరణము బంగరు ముద్దుటుంగరమై యొప్పుచుండెను. నిరంకుశోపాఖ్యాన, రామాభ్యుదయ, పాండురంగ మాహాత్మ్య, కాళహస్తి మాహాత్మ్య కవికర్ణరసాయన ప్రిముఖ కృతులు పెక్కులు వింత వింత రకముల యాభరణముల రూపమును దాల్చి యుండినవి. తేనియ తేఁటలగు కూచిమంచి తిమ్మయమాటలు నూపురత్వమునుధరించి ఘల్లుఘల్లని

మెఱయు చుండెను. చేమకూరివాని యమృతంపు పల్కులు పాదకటకములై పొలుపారియుండెను. ఇఁక ప్రాచీనకవు లర్పించినవియు, ఆధునిక కవు లలంకరించినవియు నగు నూర్లకొలఁది సొమ్ములు దేవి పాదపంకజముల నలరారుచుండెను. వాని నెల్లఁ బేర్కొనజూచుట కానిపని. దేవికంఠము నలంకరించియున్న పారిజాతప్రసూనముల హార మును, రోజాపూవుల పేరును మనోహరములై యుండి నాకనులనాకర్షింపఁజాలియుండె.

అయ్యారే! నేఁటికిఁ గదా పండెను భాగ్య మని యుప్పొంగి కేల్దోయి మోడ్చి యుచ్చైస్స్వ రంబున,

ఉ॥ అంబ నవాంబుజోజ్వల కరాంబుజ శారద
చంద్ర చంద్రికా। డంబర చారుమూర్తి, ప్రకట
స్ఫుటభూషణ రత్నదీపికా। చుంబిత దిగ్విభాగ
శ్రుతిసూక్తి వివిక్తనిజప్రభావ, భా। వాంబర
వీధి విశ్రుత విహార, ననుం గృపఁ జూడు
భారతీ॥

అనుచు సాష్టాంగముగ ప్రొక్కులిడి కరవు దీఱ మాతను స్తుతించితిని.

కవి రాజుల యాసనములవంక దృష్టిమర లించునంతలో నపుడు నాకన్నులఁ దనుపుచుండిన

మహనీయులు మునుపటివారుగారని యెఱింగితిని.
కాని వీరును స్ఫురద్మూర్తులు తరుణమూర్తులు.
అపూర్వ ప్రభా భాసమానులును. వీరెవరొకో
యనుకొనుచుండునంతలో నొక మహాశయుఁడు
లేచి "దేవి! ఆనతి యియ్యనేని నా మిత్రులైన కీ
మహాకవుల పరిచయ మిచ్చెద" ననుడు, దరహసిత
వదనయై యాదేవి యంగీకారసూచకముగ నల్లన
శిర మాడించె. అతఁడును ననుజేరవచ్చి రమ్మని
నను వెంటఁగొనిపోవుచు నొక్కొక్కరుఁడుగ నా
కవుల నభివర్ణింపసాగెను.

మున్ను వల్మీకభవుఁ డలంకరించియున్న పీఠ
మున నిపుడు వాగనుశాసనుఁడు ప్రకాశించు
చుండె. కాళిదాస కవిరా జధిష్టించి యుండిన
గద్దియ యిపుడు కవిబ్రహ్మతో నలరారుచుండెను.
ఆ మహాపురుషుని చేరువనున్నవారు సర్వజ్ఞుఁడును,
సాహిత్య రసపోషణ చక్రవర్తియు. ప్రక్కన శ్రీ
రామనామ స్మరణసేయుచున్న మహానుభావుఁడు
బమ్మెరపోతన యఁట. అతని దాపున వెలుఁగు
చున్నవాఁడు భాస్కరుఁడు. తరువాత ననన్య
సాధారణ తేజోవిరాజితుఁడగు నొక మహాశయునిఁ
జూచి యితఁ డెవఁడోయని తలపోయుచుండు నంత-
లో "ఇంతలు కన్నులుండియు", నితని గురుతింప

నైతివే ? ఇతఁడు మాదేవికి తాత, యని నామిత్రు డందిచ్చె. అల్లసాని పెద్దనయని యెఱింగి 'యాహా!' యని నేత్రపర్వముగ క్షణ మతనిఁ గనుంగొని భక్తితో నమ్రుడనైతి. అతని దక్షిణభాగమునఁ జుక్కలలో శుక్రునివలె నొక వ్యక్తి మెఱయు చుండెను. ఆంధ్ర కర్ణాట రాజ్యలక్ష్మీతపఃఫల మగు సంగీతసాహిత్య సమరాంగణసార్వభౌముఁడు కృష్ణదేవరాయఁ డతఁడని వినఁగల్గుటకు నాహృద-యమెంత వెల్లివిరసెనో వ్రాయుశక్తి నాకిపుడు లేదు. అతని నాశ్రయించి యున్నవారు నంది తిమ్మన, సూరకవి, రామకృష్ణుఁడు, ధూర్జటియు. ఆంధ్రకవితాపితామహుని వామభాగము నాశ్రయించిన ధీరుఁడు సంగీత సాహిత్య కళానిధియగు మన రామరాజభూషణుఁడు. ఇతనిని సాసూయముగఁ దిలకించుచున్న వాఁ డయ్యలరాజ కవి. అతని కావలఁ గూర్చుండి పెద్దనపై రూక్షేక్షణ ప్రయోగము సేయుచున్న యొకనిఁ జూచి యెవఁ డీతఁ డనుకొనునంతలో "నితఁడు యతిని విటునిగ, విటుని యతిగఁ జేయఁజాలినవాఁడ"ని నా మిత్రుఁడు పలికెను. సంకుసాల నృసింహుఁడాయని లోలోన నవ్వుకొంటిని. అతని ప్రక్కననున్న వాఁడు కందుకూరి రుద్రుఁడు. ఆవల నెడముగా

నున్న గభీరమూర్తి కవిసార్వభౌముఁడట! వానిచే-రుతనున్నవారు పిల్లలమఱ్ఱి పినవీరనయు, రంగనాథ కవియు. తరువాత నించుక దూరముగ కూర్చి మంచి పండితుఁడును, చేమకూరకవియు నాసీను లైరి. ఆవలనున్న యతఁడు క్షేత్రయయని నా మిత్రుఁ డానతిచ్చెను, "ఇతఁడు కవియని మా వారనుకొనరే? ఏకృతి రచించెనో?" యని నేనడుగునంతలో నామిత్రుఁడు "తెలివియొకరిసొమ్మా?" యని నవ్వెను. చేరువ నాసీనుఁడుగనున్న యొక మహాశయుఁడు,"ఎందరోమహానుభావులు"అనియె. ఇతఁడు త్యాగరాజు కాఁబోలు ననుకొని సంత సించితిని.

ఇంకను నెందఱనో కవులను నామిత్రుఁడు నాకెఱింగించెగాని వారి వివరములు వ్రాయ నలవికాదు.

అల్లంతదూరమున నిలుచుండి యొక మహాశయుఁడు చేతి పళ్ళెరమునందలి రమ్యములగు జాతి సుమముల దేవిపాదముల నర్పించుచుండె. ఇతఁ డెవ్వఁడని యడుగ నతఁ డర్పించిన పుష్పములఁ జూడుమని నాసఖుఁడు పలికెను. దేవి దక్షిణ పాదముపైఁబడిన సుమమున చిత్రనళీయమనియు వామపాదముపైబడిన సుమమున విషాద సారంగ

ధర మనియు నామము లుండుటఁజూచి "వహవ్వా! మన యాంధ్రనాటక పితామహుఁడు సుమీ!" యని పొంగితిని. అతని చేతి పళ్లెరములో నింకను రమారమి ముప్పది సుమము లుండెనని నమ్మెద. మనోహరములగు భావగీతము లను మల్లికాప్రసూనము లెందుండియో వచ్చి యపుడపుడు దేవిపాదములపైఁ బడుచుండెడివి. మన దేశమునందలి కవులు వ్రాసి పంపుచున్న భావ గీతిక లవియని తెలిసికొంటిని.

పట్టుపుట్టముల మేలిముసుంగులు మూసిన బంగరు పళ్ళెరములఁ బట్టి బారులుతీరి పలువు రల్లంతదూరమున నిలిచి యుండిరి. "అమూల్యములగు పలురకముల తాలసొమ్ముల దేవి[illegible]ని వచ్చితిమి, కాని యామె మావైపున కేనిచూడదే? మాకర్మమేమి!" అని వారిలో నొకఁడు విషణ్ణవదనమున గొణుగుకొనుచుండెను. వీరుకాక గోనెసంచులలోఁ గానుకలు మోసికొని గుంపులు గుంపులుగ శాలలోఁ బ్రవేశింపఁగోరి వేత్రధారుల చేతిబెత్తముల వ్రేటులనైతము గమనింపక యహమహమికతో వచ్చుచున్న జనస్తోమమును ద్వారపాలు రర్ధచంద్ర ప్రయోగమున బహూకరించుచుండిరి.

"మీ జర్మనీ గిల్టుసొమ్ములు, మాజపాను గాజుపెంకులు, మాదేవి మోయలేదు. వలదు, వలదు, పొండు, పొండు," అని చేయాడించుచు సభాస్తారులు కొందరు గద్దించుచుండుట చూచి నాకేమో పాపమనిపించినది. ఈ బాధల పడ నిచ్చలేనివారు కొందఱు బహిశ్శాలలోనుండియే గంపలలోని పూవులను మొగ్గలను దోసిళ్ళతో లోనికిఁ జల్లుచుండిరి. వానిలో చాలవఱకు నిర్గంధములు. ఇవి నవలల తోఁటలోనివఁట! వానిలో నేయొకటో రెండో తక్క తక్కినవన్నియు నందే ప్రోవులుప్రోవులుగఁ బడి వాడువారుచుండినవి.

ఈవిచిత్ర దృశ్యమును చూచుచుండునంత నా హృదయాంతరాళమున నొక యూహ వొడమెను. కవులయొక్కయుఁ గావ్యములయొక్కయుఁ దారతమ్య విషయమున మనవారి కనేకసంశయములు గలవు కదా! వాగనుశాసనుఁ డలంకరించు నాఁటిదాఁక భారతీదేవికి భూషణములే లేవా? సోమశంభుదాసు లర్పించిన కానుకలలో నెద్ది వాగ్దేవికిఁ బ్రియతరము? మణి కేయూర మర్పించిన కళాదుఁ డాంధ్రభోజుఁడా అల్లసానివాఁడా? మనవారు తగవులాఁడి తలలు పగులఁగొట్టుకొనుచున్న యిట్టి సమస్యల కుత్తరములఁ బడయుట

కింతకన్న మంచియదనేది?

అంతలో నాసభలో గొప్పగడబిడ బయలు దేరెను. సభ్యులెల్ల దిగ్గునలేచి నిలచి జయ జయ ధ్వానములు సలుపసాగిరి. మహర్షులు వేద ఘోషలతోడ గంధర్వుల గానధోరణి వీతెంచెను. వేత్రిధారుల పరాకులు చెవులు సెలవోవుచుండ నా సభాంతరాళమునఁ జతురాననుండు ప్రత్యక్ష మయ్యె!

అదటుననుండు కారణమున నులికిపడు నంతలో నాగదిలో బల్లపైని మునుపటి సరస్వతీ చిత్రిపట మొకటితప్ప యితర దృశ్యమంతయు మాయమయ్యెను. పూజకై వలయు పరికరము లతో నామిత్రులు కొందరు గదిలోని కరుదెంచి యుండిరి. క్షణమాత్రము భ్రాంతుఁడనై యుంటిని.

ఆహా! నాభావస్వప్న మింత యకాలమున నంతరింపకుండిన యెడల నాంధ్రి లోకమునకు నే నెన్నో సారస్వత రహస్యముల నెఱిఁగింపఁగలిగి యుందును కదా?

## దీపావళి.

౨౨

ప్రపంచమున నెందఱు క్రూరులుండలేదు? ఎందఱులోకకంటకులుదయమంది జనులకు మితిలేని బాధ లొనరింపలేదు! దురాచార పరాయణులగు రాక్షసరాజు లెందఱు జగమును హింసింపలేదు? పతివ్రతల మానభంగము గావించి యేకర్మమెఱుఁగని శిశువుల సయితము లక్షలకొలఁది మారిమసగి నట్లు హతా హతముఁజేసి భరతమాత కనులకు నీరు దెచ్చిన నీచాతి నీచులు మన ప్రాచీన చరిత్రలో నెందఱు గానరారు? కాని యిదేమి కర్మమో నరకాసురునిపై మాత్రము మనవారికిఁ జెప్పరాని చలము గలదు! వానిపైనన్నచో మనవారు కాలు ద్రవ్వి జగడమునకు వెళ్ళుదురు.

రావణుఁడు లేఁడా? హిరణ్యాక్ష హిరణ్యకశిపు లుండరా? సుందోప సుందులు సజ్జనులా? కంసుఁడు లోకమిత్రుఁడా? వీరిలో నొకరి జోలికయిన మన వారు పోరే! వీరికి తేరకుఁ జిక్కినవాఁడెల్ల గ్రహము చాలని నరకాసురుఁడే! ఆబాలవృద్ధముగ నందఱకు నరకునిపై దండయాత్రయన్న పండుగ! ఎనిమిది దినములుగ నీ యుద్ధమునకై సన్నాహమే! ప్రతి మనుజుఁడును బాణసంచా సిద్ధముగ నుంచుకొనును;

చతుర్దశి రాకకై యత్యుత్కంఠతో నెదురుచూచును; మునుముందుగఁ దానే నరకాసురుని జంపి ఖ్యాతివడయ నెంచును.

మొన్నరాత్రి మూడుగంటల వేళ బీదలు ధనికులు బాలురు వృద్ధులు, నందరు తమ తమ యిండ్లలో దీపములు వెలిగించుకొని కాచియుండిరి. అభ్యంగనములాడి కృత కౌతుక మంగళులై నరకుఁడే నిమిష మేమూలనుండి వచ్చునోయని యత్రస్తప్రాణులై యెల్లవారు నెదురుచూచు చుండిరి. నరకాసురుఁడిపుడు రాకుండినచో బాగుండునని తలఁచితిని. కాని బ్రహ్మవ్రాలు తప్పించుకొన నెవనితరము? నరకుఁడు విధిలేక రానేవచ్చెను. అబ్బా! ఏమిచెప్ప నాయుద్ధరంగ మహిమ! క్షణమున నూర్లకొలది-వేలకొలఁది-లక్షల కొలఁది-కోట్లకొలఁది, బాణము లొక్క పెట్టున నాకసమున నాట్యమాడ సాగెను. ఆ కోలాహలము వర్ణనాతీతము! నేను ముందు నేను ముందను ధ్వనులు; పట్టు, విడువు, కాల్చుమను వీర ఘోషలు; హా, హూ, యను నాశ్చర్యారావములు; అయ్యో, తగిలెను. పొమ్మా, అను నార్తరవము లును లోకమునిండెను. దిశలు చెవుడు పడియె. బాణాగ్నులు జగమెల్ల నిండుకొనియె.

అందరును బాణముల విడుచువారే! అందరు నభిమంత్రించు వారే! అందరు నస్త్రవిద్యాపటిమ చూపువారే. ఆబాణము లసామాన్యములు. చక్ర బాణము, ఆకాశబాణము, నక్షత్రబాణము, చంద్ర బాణము, తారామండలము, పూలబాణము, మొగ్గలబాణము, లవంగబాణము, శాంతిబాణము, పాముబాణము, తేలుబాణము, జల్లెడ బాణము, పొరక బాణము-ఎన్నియని వాకొననగును? అన్ని-యు మహాస్త్రములు; అన్నియును భయంకరములు; అన్నియు నగ్నిముఖములు; పూర్వకాలపు బ్రహ్మాస్త్రాదులనైన నుపసంహరింపవచ్చుఁగాని, ప్రయోగించినమీఁద నివి యుపసంహరించుట కానిపని. తమ కడ్డునిల్చినచో నుపసంహర్తనే యివి చుట్టుముట్టుకొని యాహుతి గొనఁగలవు. ఇన్నిటికిఁజిక్కి నరకాసురుఁ డింకను జీవముతో నుండునా? కాలి భస్మమగునుగాక.

నరకాసురుఁడును సమర్థుడే! అస్త్రవిద్యాపారంగతుఁడే. శ్రీకృష్ణునంతవానిగూడ నెదిర్చిన ధీరుఁడే. సర్వ బాణములనును బ్రతి క్రియ లెఱిగిన వాఁడే. కానియిప్పటి మనబాణవిద్య వాని యాచార్యుఁడెఱింగినది కాదు. కాన నీబాణాగ్ని కతఁడు ప్రతిక్రియ సేయఁజాలఁడయ్యె. అతని యవ

థ నాకే కర్మమగుచుండెను. వారుణాస్త్రము నించుక యభిమంత్రించి విడిచి యున్నంత నీ బాణములన్నియుఁ దమ తమ యజమానులెంత మంత్రించినను వినక పెంటికుక్కలవలెఁ దోకల ముడుచుకొని 'ధుప్పు ధుప్పు'మని యందే పొగ రాచుచుఁ బడియుండును. కాని, నరకాసురుని కీనూతన రహస్యముఁ దెలిసినది కాదు, పాపము.

ఇందొక్క విశేషము. నరకాసురుఁడు నామమాత్రావశిష్టుఁ డయినఁగూడ మావీరులు యుద్ధమును జాలించినవారు కారు. తమ తమ కడనున్న బాణములు ముగియుదాఁక వారు శస్త్ర సన్యాసము గైకొనలేదు. వీరిలోనొకఁడైనఁ గర్ణుని వలె నర్ధరథుఁడు గలఁడా! ఆహా ఇట్టివీరులు లభించి యుండినచో దుర్యోధనునకు రాజ్యము పోవుచుండెనా?

మగవారిమాట యటుండ, నాఁడు స్త్రీలు గూడ నరకాసురునిపైఁ బగ దీర్చుకొనిరి. తమ సత్య భామ నాఁడద్భుత పౌరుషము నెఱపి నరకునితో యుద్ధముచేసెనని వారు చాల గర్వించుచుండిరి. ఒక యింట నొకనాగరికతరుణుఁడు సర్వాలంకార భూషితుఁడై సవిలాసముగ నిలిచి బాణప్రయోగము గావించుచుండెను. అతనియర్ధాంగి యంతలో

వచ్చి "మాసత్యభామ నాఁడు యుద్ధము చేసెనఁట! నేనును నేఁడు కొన్ని బాణముల విడుతును. తెండు" అని పతినడిగెను. "సరి సత్యభామ వంటిదానవా పొమ్ము" అని యతఁడు నిరాదరముసూప నా మానిని రోషమున "ఎట్టికృష్ణున కట్టి సత్యభామ" యనుచు బలాత్కారముగ రెండు బాణముల లాగి కొని ప్రయోగము చేసియేపోయెను. ఈ సత్యా కృష్ణసంవాదమువిని దూరమునఁ బక పక నెవరో నవ్విరి. బాణాగ్నిచే దగ్ధుఁడగుచున్న నరకా సురుఁడే యను కొంటిని.

ఈ దిక్కుమాలిన నరకాసురుని యవస్థను గూర్చియే చింతించుచు నాఁడు రాత్రి శయ్యచేరి తిని. జాగ్రదవస్థ తప్పియు దప్పక మున్న నాకనుల కొక స్వప్నము గోచరించెను. నేనొక యుద్ధ భూమిలో నుంటిని. రణము శాంతించి యుండి నందున వీరు లందఱు దమ నివాసముల కరిగి యుండిరి. రంగమంతయు భస్మరాసులచే ఘోర ముగఁ గన్పట్టు చుండెను. అందొకచో నొక భస్మరాశిలో సర్వాంగముల బొబ్బ లెగసియుండ బాధపడుచు దాహామని నోరు తెఱచుచున్నవాని నొక్కని గంటిని. చేరువఁజని నీరిచ్చి "అన్నా ఎవఁడవీవు?" అంటిని. అతఁడిట్లనియె.

"హిందూ దేశవాసుల బాణ విద్యా విహారమునకుం జిక్కిన పాపి నరకాసురుడ నేను. అన్నా! ఏమి నాగ్రహచారము! నాపైననే వీరి కింత చలమేల? నీవేమి తలంతువో కాని, మీ వారి యజ్ఞత నాకేమియు సరిపడలేదు. ఎన్నడో చచ్చి స్వర్గాననున్న నన్నేలఁ బట్టి తెచ్చి యిట్లు కాల్పవలయు. వీరికివేరుపనిపాటలులేవా? ధనమును మితిలేక వెచ్చించి బాణములగొని తమ ధనుర్విద్య నంతయు నాపయింబెట్టి తగులఁ బెట్టినచో వీరికేమి ఫలము? నాకై పాడుచేసిన ద్రవ్యమున సగబాలుతో నూరూర మంచి గ్రంథాలయము లగునే? ఇట్టి ధనమంతయు బ్రోగుచేసినచో నొకగొప్ప జాతీయ కళాశాల యేర్పడదా? దేశముబాగుపడదా? ఏమి మౌఖ్యమిది! ఆబాణములైనతమంతజేసికొను శక్తి వీరిలేకదే? ఏ జపానుతల్లియో, ఏచీనా సోదరుడో, తయారుచేసి వీరికి భిక్ష మివ్వవలసి యుండుటకైన వీరు సిగ్గుపడరుగదా! వీరికిబుద్ధి వచ్చుదాఁక నేనిట్లు ప్రతివర్షము ననుభవింప వలెననుట నాకుశాపము. నాయరణ్యరోదనము వినువారెవ్వరు. నాజన్మ భూమి యెన్నడు బాగుపడగలదో? అన్నా పోయి వచ్చెద! వచ్చునేట జూచెదగాక."

Y.V. Narasimhacharya.



అంతలో నాకసమునుండి విమానమురాగా నందు గూర్చుండి యతఁడంతర్ధాన మందెను. నేనును మేల్కొంటిని.